# బెజవాడ గోపాలరెడ్డి

## పుస్తకాలు

వేయి సోయగములు.

'ఆమె' పంచకము

1. ఆమె (1978)
2. ఆమె జాడలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె తళుకులు (1982)
5. ఆమె చెణుకులు (1982)

శతకవితలు.

'కవితా' పంచకము

6. కాలవాహిని (1979)
7. సాహిత్య సుందరి (1980)
8. ప్రసూన మంజరి (1981)
9. పరిమళ తరంగాలు (1982)
10. సాగర సమీరాలు (1983)

అనువాదాలు.

అనువాదములు (బెంగాలీనుండి)

1. రవీంద్రుని నాటికలు (5 పుస్తకాల సంపుటి)
2. కథలు - కల్పనలు
3. వానచినుకులు
4. ఊర్వశి — కాళిదాసు
5. నైవేద్యము — స్మరణ
6. తాజ్‌మహల్.
7. ఇక్‌బాల్ కవితలు ఉర్దూనుండి

# అంకితము

జైళ్లలోను రాజకీయజీవితములోను
నన్ను అభిమానించుచుండిన

## శ్రీ సి. రాజగోపాలచారి గారికిని
## శ్రీ బి. పట్టాభి సీతారామయ్య గారికిని

భక్తిశ్రద్ధలతో

# సాగర సమీరాలు



బెజవాడ గోపాలరెడ్డి

Hon. D. Litt

పరిప్రేక్ష

డాక్టర్ యస్. సంజీవదేవ్

Hon. D. Litt (Andhra)

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలకురోడ్డు, హైదరాబాదు-1

SAGARA SAMEERALU
Poems in Telugu
BY B. GOPALA REDDI

ప్రథమ ముద్రణ
మే 1983

12

8


వెల : పది రూపాయలు

ప్రతులకు
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలకురోడ్డు, హైదరాబాదు — 500 001

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజయవాడ

ముఖచిత్రం
శ్రీ మారేమండ శ్రీనివాసరావు

ముద్రణ
మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్,
1—1—694/2/ఎ
గాంధీనగర్, హైదరాబాదు - 500 380.

# గ్రంథకర్త జీవన వివరాలు

| | | |
|---|---|---|
| జననము | — | 5 ఆగష్టు, 1907<br>బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరుజిల్లా.<br>తండ్రి – పట్టాభిరామరెడ్డి<br>తల్లి – సీతమ్మ. |
| చదువు | — | బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు.<br>ఆంధ్ర జాతీయ కళాశాల<br>(1921–24).<br>విశ్వభారతి<br>(1924–27). |
| సమరపర్వము | — | సర్కారుబడి వదులుట జనవరి 1921.<br>జైలుశిక్షలు – ఆరు మారులు.<br>1930, 31, 32, 33 లోను,<br>1940, 41, 42, 43 లోను,<br>కొంతభాగాల్లో జైలులో ఉండినారు. దాదాపు<br>4సం॥లు జైలులో మకాం. ఎ బి సి క్లాసుల<br>ఖైదీగా డెటిన్యూగా. |
| ఉద్యోగపర్వము | — | మంత్రిగా– మద్రాసు, కర్నూలు,<br>హైదరాబాదు, ఢిల్లీలలో– 186 మాసాలు<br>గవర్నరుగా – ఉత్తరప్రదేశ్‌లో 62 మాసాలు<br>ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రొఫెసర్–<br>జూన్ 1951 నుండి 57 వరకు. |
| సాహిత్యపర్వము | — | తెలుగు భాషా సమితి అధ్యక్షులు – 1948 నుండి<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - ఆగష్టు<br>1957 నుండి డిసెంబరు 1982 వరకు<br>కేంద్ర సాహిత్య అకాడమీ రెండవసారి -<br>1978 జనవరి నుండి 82 డిసెంబరు వరకు,<br>83 జనవరి నుండి<br>జ్ఞానపీఠము – 1963 నుండి 1971 వరకు. |

# విషయ సూచిక

# నివేదన

సాగరసమీరాలు నా దీర్ఘ కవితల ఐదవపుస్తకము. నేను ఆపేక్షించిన నా సాహిత్య రచన, ప్రచురణ సమాప్తిచెందుచున్నదని పరితృప్తితో నిట్టూర్చుచున్నాను.

వేయి సోయగము లనబడు 'ఆమె' పంచకమును 1982 సంవత్సరములో సెప్టెంబరులో ప్రచురించినాను. ఆమె, ఆమెజాడలు, ఆమె నీడలు, ఆమె తళుకులు, ఆమె చెణుకులు ఈ ఐదు హ్రస్వముక్తకాల పువ్వుచెండ్లు. వేరువేరు పువ్వులు. బొట్లుబొట్లుగా కురుస్తున్న వానచినుకులు. భావ బిందువులు.

ప్రస్తుతము శతకవిత లనబడు దీర్ఘ కవితల పంచమ గ్రంథాన్ని వెలువరించుచున్నాను. కాలవాహిని 79 మేలో, సాహిత్యసుందరి 80 ఫిబ్రవరిలో, ప్రసూనమంజరి 81 మార్చిలో, పరిమళ తరంగాలు 82 ఏప్రిల్‌లో నా సాహిత్య వసంత వనవీథులలో వెలుగును చూచిన పుష్పమాలలు. ధారలుగ కురిసిన వాన జల్లులు. భావస్రోతాలు. సాగర సమీరాలతో శతాధికమగు దీర్ఘ కవితల కృషి పండి కుప్ప నూరుచుటకు సంసిద్ధముగా నున్నది. 77 మే మాసములో నా ప్రథమ కవితను తాజ్ మహల్‌ను వ్రాశాను. 77 జూలై ఆగస్టులో 'ఆమె'లోని హ్రస్వముక్త కాలను ప్రారంభించాను. ఆ తర్వాత దీర్ఘ కవితలు, హ్రస్వముక్తకాలు ఒకదాని నీడలో మరొకటి పయనించసాగాయి. ఐదు సంవత్సరాలు నిరంతర ఉత్సాహముతో సాహిత్య రచన సాగించాను. 78 మార్చిలో నా మొదటి పుస్తకాన్ని ప్రచురించాను. వరుసగ ప్రచురణ సాగింది. 83 మే మాసములో నా పదవ పుస్తకాన్ని ప్రచురిస్తున్నాను. ఇది నా

జీవితములో ఒక ముఖ్యమైన ఘట్టమని తలచుచున్నాను. అనువాదాలనుండి బయలుదేరి సొంతకవితల రేవును చేరుకున్నాను. నా అనువాదాల మాతృకలు పద్యవిద్యయే. నా సొంతాలు కవితావిద్యయే. ఛందస్సు నేను ఎన్నడు యత్నించలేదు. నాకు అలవికాని పనికి పూనుకోలేదు.

నా సొంత 'దీర్ఘ' కవితల మొదటి నాలుగు పుస్తకాలకు నేను ఎవ చేత ముందుమాట వ్రాయించలేదు. నా అనువాదాలకు, 'ఆమె పంచకా'నికి వ్రాయించాను. నా అనువాదాల మొదటి పుస్తకానికి– రవీంద్రుని నాటికలు, దేవయాని–చిత్రాంగద అను గ్రంథమునకు నా గురుతుల్యులు, కృష్ణా పత్రిక సంపాదకులు శ్రీ ముట్నూరి కృష్ణారావు గారు పరిచయ వాక్యాలు వ్రాశారు 40 సం॥ల పూర్వము. నాకు తెలిసి మరి ఏ ఇతర గ్రంథానికి వారు పరిచయ వాక్యాలు లేక ముందు మాటలు వ్రాయలేదేమో! వారి దర్బారులో వినిపించుకొని ఆ పరిచయమును వ్రాశారు. వారు నాపై చూపిన అభిమానమునకు నేటికిని కృతజ్ఞతతో నమస్కరించుచున్నాను. జైలులో వారి ప్రజ్ఞావిశేషములను దగ్గరగ చూచే అవకాశము కలిగినది.

నా దీర్ఘ కవితల ఐదు పుస్తకములను సమీక్షించమని డాక్టరు సంజీవదేవ్‌గారిని కోరగనే దయతో అంగీకరించిరి. తనదైన సొంత వెన్నెల బాటలో తిరిగే రసహృదయము వారికున్నది. సౌందర్య పిపాసి. చిత్రకారుడే గాక చిత్రకళా విమర్శకులు కూడా. రేఖలలో లేఖలలో తమ ప్రజ్ఞ చూపగలిగినవారు. భావప్రధానమైన కవితల తెనుగులో ఇంగ్లీషులో రచించే నేర్పరులు. సంప్రదాయాన్ని మూఢముగ అనుసరించే బాటసారి కారు. తనదైన సొంతబుద్ధితో చూచేవారు. అన్నిటికన్న మిన్నగ సరళ ఉదారహృదయులు. అట్టివారు నా రచనలు సమీక్షించి వ్రాస్తే, నిశితముగ పరీక్షించి మంచి చెడ్డల చెప్పితే నా రచనల విలువ హెచ్చగలదని వారిని

కోరితిని. దీర్ఘమైన సమీక్షనే వ్రాసి పంపినారని విన్నాను. ఏ గుణములు ఏ అవగుణములు పేర్కొన్నారో నాకు తెలియదు. నేరుగా హైదరాబాదుకే పంపిరి. నేను చూడకనే అచ్చుకు ఇయ్యమని కోరితిని. నేను ముందుగ చూడవలసిన అవసరమేమున్నది? వారు ఏమి వ్రాసినా, వారి తీర్పు నాకు అంగీకారమే. చూడకనే, వారికి కృతజ్ఞత తెలుపుచున్నాను. ఐదు గద్య కవితా గ్రంథాలను చదవడము, సమీక్షించడము తేలికయైన పని కాదు కష్టముతో కూడుకొన్న పనే. ఇచ్చిన కష్టానికి క్షమాపణలు, చేసిన పనికి నమస్కారాలు. స్వయముగ వారి ఊరు తుమ్మపూడి వెళ్ళి ప్రత్యక్షముగ నమస్కరించెదను.

సాగరసమీరాలలోని 'మూడు కవితలను మూడు కవితా చిత్రాలు' అను పేరుతో డాక్టరు రావూరు భరద్వాజగారు ముందుమాటలేమీ లేకుండా, ఎప్పుడు ఎందుకు ప్రచురించారో తెలుపకుండా ప్రచురించారు. 1 మరలిన కపోతాలు 2 సరసుడు కాడు 3 జీవన సమరము వీనిని విని సంతోషించి, తన ఆమోదముద్రను తెలుపుటకై, నా సమ్మతితోనే ప్రచురించిరి. జీవనసమరమును ఇదే పేరుగల వారి పుస్తకముపై విజయవాడలో 1-8-82 జరిగిన గోష్ఠి సందర్భంలో శ్రీ భరద్వాజగారికి నేను కానుకగ ఇచ్చిన కవిత. విజయవాడ శ్రీ త్రిపురనేని వేంకటేశ్వర రావు గారు ఏర్పాటు చేసిన సభలో చదివి వారికి ఒసగితిని. మూడు కవితలు మూడు ధోరణులలో నడచిన కవితలు. వానిని ప్రచురించి తిరిగి నాకు కానుకగ ఇచ్చిరి. వ్రాతప్రతిలో ఇచ్చిన కవితా కపోతము అచ్చులో నా చేతికి చేరింది. ఇచ్చింది వృథాగా పోదనే సత్యాన్ని రుజువుచేసింది. ఎందుకు ఈ మూడు కవితలు చిన్న పుస్తకరూపములో వచ్చాయో తెలుప లేదు. కవితలను ఆదరించారు. హర్షాన్ని ప్రకటించారు. ప్రచురణ వారే చేశారు. వారికి నా కృతజ్ఞతలు.

ముఖచిత్రం వేసిన సాహిత్య అకాడమీ సభ్యులు శ్రీమారేమండ శ్రీనివాసరావుగారికి, అచ్చుపనిలో సాయపడిన మాష్టర్ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, అకాడమీ శ్రీ పాండురంగయ్య గారికి, భాషాసమితి శ్రీ యార్లగడ్డ ఆంజనేయులు గారికి నా కృతజ్ఞతలు.

వేయి సీసయగములతో ఆమె 'పంచకము' 82 సం॥లో పూర్తి ఐనది. శత కవితలతో 'కవితా పంచకము' 83 సం॥లో పూర్తి అగుచున్నది. అనుకొన్న పది పుస్తకాలు పూర్తి అగుచున్నవని పరితృప్తి. తెడ్డులు చుక్కాణి వదలి జీవితనౌకలో విశ్రమింపవచ్చును. సేద తీర్చుకొనవచ్చును. జీవన సంగీతమునకు తాళము వేయుచు రాగసుధారసమును గ్రోలుచుండ వచ్చును.

ఈ సంతృప్తికి తగినట్లు 'సుదర్శన మహల్'ను వదలి 'శాంతి నికేతనము' చేరుచున్నాను. అదే మా క్రొత్తఇల్లు (స్వప్నకుటి).

సుదర్శన మహల్
21-4-1983
శ్రీరామ నవమి

బెజవాడ గోపాలరెడ్డి

క్రొత్త అడ్రసు:—
శాంతినికేతన్
నెల్లూరు –3

# పరిప్రేక్ష

డాక్టర్ సంజీవదేవ్

ప్రతిమనిషికి కళ్లున్నవి కనుక చూస్తాడు, చెవులున్నవి కనుక వింటాడు. ప్రతిమనిషీ కవికాకపోయినా ప్రతికవీ మనిషే. కనుక అందరివలెనే కవికీ వుంటవి కళ్ళూ చెవులూ.

అయితే, కవి కళ్లూ చెవులూ మిగతావారి కళ్ళకంటే చెవులకంటే ఆకారంలో కాని ఆయతనంలో కాని భిన్నంగా వుండక పోయినా, చూడటంలో వినటంలో మాత్రం భిన్నంగా వుంటవి.

నిజానికి ఈ భిన్నత్వం కంటికీ చెవికీ సంబంధించింది మాత్రమే కాక మనసుకు సంబంధించింది ప్రధానంగా. కన్ను చూడదు, చెవి వినదు, వీటి ద్వారా చూస్తుంది, వింటుంది మనసు.

కనుక కవిమనసు కవికానివారి మనసు కంటే భిన్నమైంది.

కాబట్టి మిగతావారికంటే కవి విలక్షణ జీవి. ఈ విలక్షణత్వం కవికీ కవి కాని వారి మధ్య మాత్రమే కాక కవికీ కవికీ మధ్యకూడ వుంటుంది. ఇటువంటి విలక్షణ కవుల్లో విశిష్టత వుంటుంది.

ఇటువంటి విశిష్టతగల విలక్షణ కవి గోపాలరెడ్డిగారు.

ఆయనిది కొన్ని సంవత్సరాల క్రిందటి వరకు రాజకీయ జీవితం. అప్పటి వరకు ఆయనలో కవితాసక్తి తప్ప కవితాశక్తి సగం నిద్రాణమై వుండేది. నాలుగేళ్ళనుండి ఆ కవితాసక్తి కవితాశక్తిగా మారి కవితా వృష్టిలో కమనీయంగా రూపకల్పన పొందసాగింది.

భావంలేని కవిత అరుదుగా మాత్రమే వుంటుంది నిజమే కాని కొందరు కవులవి లౌకిక భావాలుగా మాత్రమే వుంటే మరికొందరివి లోకోత్తర భావాలుగా మాత్రమే వుంటవి, అరుదుగా కొందరివి రెంటి సమ్మేళనంగా వుండటం జరుగుతుంటుంది. గోపాలరెడ్డిగారివి అటువంటివే.

అవొక ప్రత్యేకస్తరానికి చెందినవి. అవొక వినీల గగనంలోని విమల తారలు! అవి ఛందోబద్ధ కవితలుకావు, అవి ముక్త ఛందాలు. ప్రథమంగా ఫ్రాన్సులో Vers libre (free verse) అనే పేరుతో ఆవిర్భవించి తరువాత విఖ్యాత అమెరికన్ కవి వాల్టువిట్‌మన్ ద్వారా విశ్వవ్యాప్తి చెందినవి.

నేడు అవి వెలుగులో వచన కవితల పేరుతో ప్రచారంలో వున్నవి. ఈ వచన కవితా రచనా రీతిని అనిబద్ధ కవితా రచన అని కూడ అంటారు.

కొందరు నమ్మినట్లు ఈ అనిబద్ధ ముక్త ఛందాలు రచించటం సులభం కాదు. ఛందం సృష్టించే శ్రవ్యమాధురి వీటిలో వినిపించదు కనుక సులభంగా పాఠకుణ్ణి ఇవి ఆకర్షించవు. ఇవి నిరాలంకృత కవితలు. రవికవి అన్నట్లు వీటిలో ఛందంలోని అందం, అందులోని గణగణ ధ్వనులు వినిపించవు.

అందుకే అలంకార వర్జితమైన ఇటువంటి ముక్తఛందాలను రచించటం సులభం కాదు, పాఠకులు వాటిని చదివి ఆనందించటం అంతకంటే కూడ తక్కువ సులభం.

పదం నుండి పదార్థం లోకి ప్రవేశించినపుడు కాని దీని రసాస్వాదన అందదు.

నిబద్ధ కవితలో ప్రత్యేకమైన కవితా పదాలను ఎక్కువగా వాడటం జరుగుతుంటుంది. అనిబద్ధ కవితలో సామాన్య పదాలను మాత్రమే వాడి అసామాన్య విషయాలను కూడ అభివ్యక్తపరుస్తారు.

గోపాలరెడ్డిగారు తమకవితల్లో సామాన్య పదాలను, అసామాన్య పదాలను కూడ సమాన దక్షతతో వాడతారు. వాటి సమ్మేళన ద్వారా మంచి ఫలితాలను సృష్టిస్తారు. అసామాన్య పదాలను ఈ నవ్య కవితలో ప్రయోగించరాదనే నియమం ఏమీలేదు.

ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ, ఇంకా ఇతర భాషా కవితల్లో అంత్య ప్రాసల ప్రయోగం అమల్లో వున్నది సంప్రదాయ సిద్ధంగా. కాని ఆ భాషల్లోని నవ్య కవితల్లోకూడ అంత్య ప్రాసలను నేడు విసర్జించారు. సంస్కృత కవితల్లోను, జపాన్‌భాషా కవితల్లోను పూర్వం నుండి కూడ అంత్యప్రాసల అలవాటు లేదు.

తెలుగు కవితల్లో కూడ తొలినాటినుండీ అంత్యప్రాసల ప్రయోగం అమల్లోలేదు. అందువల్ల నేడు మనం వాటిని వదలుకో అవసరంలేదు. ఉన్నవాటిని వదలుకొంటాం కాని లేని వాటిని ఇంకా వదలటం ఏ విధంగా వుంటుంది ?

కాని విచిత్రం ఏమంటే కొందరు నవకవుల కవితారచనల్లో ప్రయత్న పూర్వకంగా అంత్య ప్రాసలను ప్రవేశపెడుతున్నారు. అవి వున్నవారు వాటిని వదలుకోవటం నవ్యత అయితే అవి లేనివారు వాటిని ప్రవేశ పెట్టటం నవ్యత అయివుంటుందేమో తెలియదు !

గోపాలరెడ్డిగారు ఈ "సాగర సమీరాలు"తో సహా పది కవితా సంపుటాలను వెలువరచారు. ఈ కవి అదివరలో బెంగాలీనుండి, ఉర్దూనుండి తెలుగులోకి అనువాదాలు చేసేవారు. 1977లో తమ డెబ్బయ్యో ఏట తెలుగులో మౌలిక కవితా రచన సాగించారు.

రవికవి తన డెబ్బయ్యో ఏట చిత్రరచనను ప్రారంభిస్తే ఆయన శిష్యులు గోపాలరెడ్డిగారు తమ డెబ్బయ్యో ఏట కవితారచనను ఆరంభించారు !

నూతన కళలను ప్రారంభించటానికి డెబ్బయ్యో సంవత్సరం తగిన వయస్సు కాబోలు !

ఆయన మొదటి కవితా ప్రచురణ పేరు "కాలవాహిని". ఇది 1979లో వెలువడింది. ఇందులో దీర్ఘమైన మొదటి కవితపేరు ''తాజ్‌మహల్'' దీనిలో కవి అంటారు:

''భారతదేశంలో ఏమి చూడవలె ?
కాశ్మీర్‌లోని హిమగిరులు
ఆగ్రాలోని తాజమహల్
అంతేనా ఇంకేమీ లేవా ?
ఉన్నవి, ఇంకా ఉన్నవి
అలవికాని పేదతనం
చెప్పరాని అంటరానితనం
మూఢాచారాల అంధవిశ్వాసం
కులతత్వాల వెర్రితనం.''

పైచరణాల్లో ఈ కవి మృదుల సౌందర్యమయ దశకు, కఠిన బాధామయదశకు, దేనికి కూడ అప్రాముఖ్యం ఇవ్వలేదు. దేశంలో తీరని సౌందర్య తృష్ణకూ కొరతలేదు, తీరని ఆకలిబాధకూ లోపంలేదు !

ఆకలిబాధ తీరటం అవసరం, సౌందర్య తృష్ణ తీరకపోవటం అవసరం. "తాజ్‌మహల్" ఒక దీర్ఘమైన కవిత. ఇందులో ఆలోచనల ఎత్తులు, అనుభూతుల లోతులు ఎన్నో తమ స్వస్వరూపాలను ప్రదర్శించుకొని కవిలోని కవితా కుశలతను బయటపెట్టినవి.

ఈ పుస్తకంలో ఒక చిన్న కవిత, కొద్ది వ్యంగ్యసుగంధంతో గుబాళిస్తుంది. ఈ కవిత పేరు ''కవిసమ్మేళనం''.

"సాహిత్యక్షేత్రపు జీరసములో
ఒకే కవితాబీజాన్ని వేసికొని
ఇతర సాహిత్య మృగయావినోదులతోపాటు
నేను కవిసమ్మేళనపు అడవులకు

వేటకు వెళ్ళగలను
సునాయాసంగ దొరకిన
కాలవ అనే జింకను
భుజాలమీద వేసుకొని
సగర్వంగా ఇంటికి రాగలను.''

ఈ కవితలో రూపకాలంకారం రాగమాలిక అయి ప్రయోగింది. ఉపమాలంకారం కంటే రూపకాలంకారం ఎక్కువ అలంకారంగా వుంటుంది. "ఆమోదుగు పూవు ఒక నిప్పుకణికవలె వున్నది''అనే కంటే "ఆమోదుగు పూవు ఒక నిప్పు కణిక'' అనటంలో ఎక్కువ శక్తి వ్యక్తమవుతుంది. ''కాలము'' అనే కవితనుండి ఈ క్రింది పంక్తులు.

''నేడును ఎదురులేని బలిమితో
ఆపలేని ఆకర్షణతో
ఎవరు గుంజుతున్నారు ?
ఏ అయస్కాంత శక్తి అది ?
నిన్నలన్ని చేరి
నేడు పడవను
ఏ తెలియరాని తీరానికి
ఏ పేరులేని రేవుకు
చేర్ప సంకల్పమో !
చీకటి కొండల ఢీకొని
బ్రద్దలైన, నిన్నల కడలిలో
మునిగి పోతుంది.''

పై చరణాల్లో కవితానుభూతి లావణ్యంతో లాస్యం సలుపుతుంది ! ''ఏ తెలియరాని తీరాలకో'' ''ఏ పేరులేని రేవుకు'' అనే పదాలు ఎంతో కవితాత్మక భావాభివ్యక్తితో భాసిస్తున్నవి. నేడు అనే వర్తమాన కాలం రేపు అనే భవిష్యత్తులోకి రూపాంతరం చెందటాన్ని ఈ కవితా చరణాలు ఎంత వింతగా చిత్రించినవో !

ఇక్కడొక చిన్న సత్యం చెప్పకపోతే యాథార్థ్యాన్ని నేపథ్యంలో బంధించినట్లవుతుంది. ఈ కవి రచించిన ఈ మొదటి కవితా సంపుటిలో కవి మానస సరోవరంలో లేచే భావతరంగాలతో పోటీచేయలేక పోతుంది కవితాశిల్పం. తరువాత వెలువడిన గ్రంథాల్లో ఈ తారతమ్యం తగ్గిపోయి విషయానికీ రూపానికీ (Content and form) మధ్య ఒక సమత స్థిరపడింది.

సందేహంలేదు, చిత్రరచనలో రూపం ప్రధానం, భావం తరువాతది : కవితారచనలో మాత్రం భావం ప్రధానం, రూపం తరువాతది. కవితలో ముందుగా రూప ప్రాధాన్యం కనిపించక భావ ప్రాధాన్యం కనిపించినా కూడ నిదానంగా భావం ఆ భావంలోకి కరిగిపోతుండగా రూపం ప్రస్ఫుటం కావటం ప్రారంభిస్తుంది. అందువల్ల భావకవిత అనేదాని లోను, వచన కవిత అనే దానిలోను కవితాశిల్పం నగణ్యం కాదు

రెండవది అయిన "ఆమె" అనే గ్రంథంలో కవితాశిల్పం రమ్యంగా ప్రకాశించింది. ఇందులోని కవితలన్నీ కూడ మృదువైన వియోగ శృంగారం, కోమలమైన విరహశృంగారానికి చెందినవి. ఇందులో ఉర్దూ కవితల్లోని భావాలు, బెంగాలీ కవితల్లోని ప్రభావాలు, రవీంద్ర, ఇక్బాల్, గాలిబ్ మొదలైనవారి గేయాలకు ఛాయానువాదాలు రూపొంది నవి.

ఈ ప్రేమ కవితల్లో పారసీక కవితాగంధం తగులుతుంది. ఆయా భావాల, ప్రభావాల ప్రేరణవల్ల రచించిన కొన్ని మౌలిక తెలుగు కవి తలు కూడ వున్నవి, ఇందులో. ఏది ఏమైనా, ఈ సూక్ష్మ కవితలు భావాల మేఘమాలలు :

"వియోగమే
నాకు ఇష్టం
సంయోగము కన్న.
సంయోగములో
పోతుందని భయం

వియోగములో
వస్తుందని సంతోషం.''

వ్యతిరేక సత్యాలతో (Paradoxes) నిండిన కవిత ఇది. ఈ సత్యాల ననుసరించే కాబోలు కొన్ని ఆదిమ జాతులవారు తమ కుటుంబంలో ఎవర్నైనా జన్మించినపుడు దుఃఖించటం, ఎవరైనా మరణించినపుడు ఆనందించటం చేస్తుంటారట. అంటే పుట్టినవాళ్లు ఒకనాటికి మరణిస్తారనే భయంతో జననాల సమయంలో దుఃంఖిచటంచచ్చినవాళ్లు మళ్లీ ఒకనాటికి పుడతారనే నమ్మకంతో ఆనందించటం ! వర్తమానకాలానికి విలువ ఇవ్వక భవిష్యత్తుకు విలువ ఇస్తారు వీరు.

పై కవిత ఈ సత్యాన్నే చిత్రిస్తుంది. సుఖం కలిగినపుడు బాధపడటం అవుతుంది. ఆ సుఖం ఎక్కడ నశిస్తుందో అనే భయంతో, ఇదే విధంగా బాధ కలిగినప్పుడు ఆనందించటం అవుతుంది, ఈ బాధ పోయి తిరిగి సుఖం వస్తుందనే నమ్మకంతో, మరొక కవిత.

''తపిస్తూ, ఇళ్లువదలి
దొంకలపాలయ్యాను.
కొన్నినాళ్లకు ఇంటికి వస్తే
దొంకలే మెరుగుగా ఉన్నాయి.''

అంటే, దొంకల పరిస్థితి మెరుగు పడిందని కాదు, ఇంటి పరిస్థితి దిగజారి పోయిందని. బాధలున్న ఇంటిలో నివసించటం కంటే బాధలులేని స్మశానంలో నివసించటం ఎక్కువ ఆనందంగా వుంటుంది. ఇంటిలో బాధవుంటే ఇల్లే శ్మశానం, శ్మశానంలో సుఖం వుంటే శ్మశానమే ఇల్లు ! మరోకవిత :

''చేతులు ఒకటైనపుడు
వందనం
వేరైనపుడు
కౌగిలి.''

చిన్నమాటల్లో పెద్ద అర్థం ! అల్పంలో అనల్పం అంటారు ఇదే కాబోలు.

''ఆమె'' అనే పుస్తకం నిండా ఇటువంటి చురుకైన సూక్తులే. ఈ పుస్తకం అంతా ఈ కవి స్వీయ భావుకతను, ఇతర్ల భావుకతమీది ఆయన ప్రీతిని ప్రదర్శిస్తుంది. ఈ పుస్తకంలోని కవితల్లో దేనినీ వదల బుద్ధి పుట్టదు; అవన్నీ రంగుల కిరణాలే ! ఈ క్రింది కవిత ఒక భావవీచిక :

''ఆమె నాఇంటికి
వస్తానన్నది
రాకముందు
వర్షించకు
వచ్చిన పిదప
విరమించకు.''

పై తేలికమాటల్లో ఎంతబరువు ఇమిడుందో : మనిషికోరికలు ఆ విధంగా వుంటవి. ఆ కోరికల ప్రకారం ఆమె రాకకుముందు వర్షంలేకుండా వుండటం, ఆమె వచ్చిన తరువాత వర్షించటం జరిగితే బాగుంటుంది. కాని అందుకు విరుద్ధంగా ఆమెరాకకు ముందు వర్షించటం, ఆమెవచ్చిన తరువాత వర్షం ఆగిపోవటం సంభవిస్తే : మొదటిది సుఖాంత ప్రవర్తన అవుతుంది, రెండవది విషాదాంతం : "ఆమె" లో ఈ జగత్తంతా సూక్ష్మ రూపంలో ఇమిడుంది. ఆమె లేంది లేదు జగత్తు.

సాహితీ విభాగాలు అనేకం; నవల, కథానిక, నాటకం, నాటిక, ప్రహసనం, జీవనచరిత, ఇతిహాసం, వ్యాసం, కవిత మొదలైనవి. ప్రాచీన కాలంనుండీ ఇతర సాహితీ విభాగాలకంటే కవితకు ప్రాధాన్యం ఎక్కువగా వున్నట్లు తెలుస్తుంది, విశ్వ సాహిత్యం అంతటిలో కూడ.

కాని ఆధునిక యుగంలో మాత్రం కల్పనా సాహిత్యమైన నవలా, కథానికా మొదలైన వాటికి ఎక్కువ ప్రాధాన్యం వున్నట్లు తెలుస్తుంది. అయినప్పటికీ, ఆధునిక కవితా ప్రాబల్యం సన్నగిలలేదు.

కవితలో (అది నిబద్ధమైనా అనిబద్ధమైనా) ఒక విశిష్టత వుంది ; అదే సంక్షిప్తత.

సంక్షిప్తత వ్యంజనమీద ఆధారపడి వుంటుంది. వ్యంజన, లేక ధ్వని అనేది కవితా రచనకు ప్రాణం వంటిది. దీన్ని కవితలో ఉపయోగించి నంతగా మరో సాహిత్య విభాగంలో ఉపయోగించరు. ఇతరరచనల్లో ఎక్కువగాఅభిధ (Denotation), లక్షణ (Connotation) అనేవి ఎక్కువగా ఉపయోగంలో ఉంటవి. కాని కవితలో మాత్రం వ్యంజన (Suggestion) ప్రధానం.

కవితలో వ్యంజన ప్రధానం కనుక వ్యంజనకు సంక్షిప్తత ప్రధానం. పదిపుటల్లో కాని అభివ్యక్తం కాని విషయాన్ని కవితలో ఒకపుటలో అభివ్యక్తం చేయవచ్చు. మిగతా సాహిత్య రచనల్లో విషయ విశదీకరణకు ప్రాధాన్యం వుంటే కవితలో అది అంతగా అవసరం వుండదు. అందుకే సాహిత్య రచనల్లో కల్లా కవిత ఎక్కువ సూక్ష్మమైంది, ఎక్కువ వైరూప్యమైంది.

కనుకనే కొందరు రచయితలు కవితా రచనకే తమ్ము తాము అంకితం చేసుకొంటారు. వీరి వర్గానికే చెందుతారు ఈ కవితలల్లిన కవి.

ఆయన మూడవ పుస్తకం "ఆమెజాడలు". ఇందులోని కవితలన్నీ పూర్తిగా ఆమెను గురించిన ప్రేమకు సంబంధించినవే, ఆమెను గురించిన ఆరాధనకు సంబంధించినవే. ఆమె నిమిత్తమే తన అస్తిత్వం, తన వ్యక్తిత్వం, తన సర్వస్వం. తాను ఎవరోకాదు, ఆమె రూపానికి కొద్ది మార్పుతో కనిపించే ఒక ప్రతిరూపమే; ఆమె గీతానికి తాను సంగీతమే; ఆ రాగానికి తాను అనురాగమే !

మరో కవిత:

"కన్నులకు రెప్పలున్నాయి
మూయవచ్చు అందాన్ని చూడకుండా
ఆమె అందపు పొగడ్తల

వింటాను బాగా చెప్పు
చెవులకు లేవు మూతలు.''

రూపాన్ని చూడటంలో కన్నుకు రెప్ప అడ్డుపడవచ్చు కాని శబ్దాన్ని వింటుంటే చెవికి ఏదీ అడ్డుపడదు. రూపాన్ని కన్నుతోమాత్రమే చూడవసరం లేదు; రూపాన్ని గురించిన శాబ్దిక వర్ణనను చెవులతో విని కూడ రూపాన్ని గ్రంహించవచ్చు. ఒకటి 'కనుకలి', రెండవది 'వినుకలి'. అందుకే సాంప్రదాయిక భాషలో అంటారు నామానికీ రూపానికీ భేదం లేదని.

ఈ క్రిందిది కొంత చమత్కారం గల కవిత:

"ఆమె నుండి జాబు వచ్చింది
తపాలా బంట్రోతుకు ఇనాం ఇచ్చాను
తెరచి, చదివితే
చివాట్లుపెట్టి తిట్టింది."

చాలా వేదన కలిగించే ఘట్టం ఇది. ప్రియతమ నుండి ప్రేమలేఖ వచ్చింది కదా అని ఎంతో ఆతృతతో తెరచి చూస్తే అందులో కనిపిస్తవి ఆమె పెట్టిన చివాట్లు ! అయితే ఏం, ప్రియంకాని వ్యక్తుల ప్రశంసల కంటే ప్రియమైన వ్యక్తుల చివాట్లు ఎక్కువ ప్రియంగా తడతవి!
ఇంకో కవిత :

"ఆమె నిడుపైన నీడ
నా భుజాలమీద సోలింది
నీడకే ఊపిరి వుంటే
ఎంత హాయిగ వుండేది.''

పరస్పర ప్రేమలేకుండా ఒకవైపు నుండి మాత్రమే ప్రేమ వుండటం బాధాకరం. అటువంటప్పుడు తాను ప్రేమిస్తున్నా, తనను ప్రేమించని వ్యక్తిని స్పృశించటం జరగదు. అందువల్ల ఆమె నీడను మాత్రమే స్పృశించగలడు. ఆమె నీడ తన భుజాలమీద సోలినప్పుడు అనిపిస్తుంది,

ఆ నిర్జీవ ఛాయకు జీవం వుంటే ఎంత బాగుండేదో అని. ప్రేమ విహ్వలకు ప్రతిబింబాలు ఇటువంటి అభిలాషలు :

ఇంతకూ ఈ కవితల్లోని 'ఆమె' అనబడే ఆమె ఎవరైనట్లు? ఈ 'ఆమె' వాస్తవరూపమా, కల్పనా రూపమా ? అయినా, ఈ 'ఆమె' ఎవరు అనే ప్రశ్నయే అవసరం లేదు. 'ఆమె' ఎవరేమిటి, ఆమె ఆమెయే, ఆమె అంటే ఆమెయే కాని ఆమె అంటే ఆయన కాదు. ఆమె ఒక అజ్ఞాత చిరప్రియతమ. ఆమె నిజంగా ఎవరో ఆమెను సృష్టించిన కవికే స్వయంగా తెలియదు. తెలియాలసిన అవసరం కూడ లేదు.

ఆమె ఒకోసారి మృదువుగా, మరోసారి కఠోరంగా, ఒకోసారి తనను ఆమె ప్రేమిస్తున్నట్లూ,మరోసారి ప్రేమిస్తుండనట్లూ గోచరిస్తుంటుంది. ఆమె ఏమి చేసినా, 'ఆమె' ఆమెయే మరొకరు కాదు. ఆమె తనకు దగ్గరలోవున్నా, దూరంలోవున్నా, కనిపిస్తూన్నా, కనిపించకున్నా, వినిపిస్తూన్నా, వినిపించకున్నా ఆమె 'ఆమె'యే, ఆమె మరొకరు కాదు.

ఆమెను గురించిన తలపులు, ఆమెను గురించిన వలపులు, జ్ఞాపకాలు, వ్యాపకాలు, సంయోగాలు వియోగాలు ఎంత పరిమళమైనవో ! అయినా, ఆమె తనను బాధించటానికి తనకు ఇష్టం కాని పనులను కూడ చేస్తుంటుంది. అందుకే కవి వాపోతాడు :

"ఆమె జపతపాలకు పూనింది
ప్రేమద్వారాలు మూసింది
భక్తి కవాటాల తెరచింది
దేవస్తుతులను చేసింది
మానవుడిని మరచింది."

అన్నిమతాల్లోని మర్మవాదులకు (ఛాయావాదులు, mystics) స్త్రీ రూపంలోనో, పురుషరూపంలోనో ఒకో అదృశ్య ప్రియతమ వుంటుంది. అటువంటి అజ్ఞాత ప్రియతమను గురించే కబీర్ అంటాడు:

ఘూంఘట్ కాపట్ ఖోల్ రే
తో హే పియా మిలేంగే"
(మేలిముసుగు తెరను తొలగించు,
నీకు ప్రియతమ కనిపిస్తాడు.)

త్యాగరాజుకూడ గానం చేస్తాడు "తెర తీయగరాదా" అని. మర్మవాదులకు ఈ ప్రియతమ ఒక అపార్థివ అస్తిత్వం. వాస్తవవాదులకు పార్థివ సత్యం.

మర్మవాదుల ప్రియతమ అస్థి చర్మ రక్త మాంసమయంకాని అశరీరి, వాస్తవవాదులది సశరీరి. మొదటివారి ప్రియతమను చూడటానికి కళ్లు మూసుకోవాలి, రెండవ వారి ప్రియతమను కళ్లు తెరిస్తే కాని చూడజాలరు. మరి మన కవి సృష్టించిన ప్రియతమ 'ఆమె' ఈ రెండు వర్గాల్లోని ఏ వర్గానికి చెందుతుందో ? బహుశా ఈ రెంటి సమ్మేళనమై వుంటుంది 'ఆమె'.

రవీంద్రుని గీతాంజలి, సూఫీ మార్మిక కవితలు, వైష్ణవుల మధురభావం, క్రైస్తవుల మార్మిక ధ్యానం, మొదలైనవన్నీ అశరీరి ప్రియతమకు ప్రాధాన్యం ఇస్తవి: రొమాంటిక్ కవులు సశరీర ప్రియతమకు ఇస్తారు ప్రాధాన్యం. గోపాలరెడ్డిగారు సగం రొమాంటిక్, సగం మర్మవాది. దృశ్యాదృశ్యాల సమన్వయం వైపు ఎక్కువ మొగ్గుతుంది ఆయన కవితారచన. అందుకే, ఆయన సృష్టించిన 'ఆమె'సగం అశరీరి, సగం సశరీరి :

అసలు కవితాతత్వం కూడ ఆ రెంటి సమన్వయాన్నే బలపరుస్తుంది. ఒక కవితాతత్వం ఏమిటి, అసలు జీవనతత్వమే ఆ రెంటి సమన్వయం!

భౌతికవాదం, భావవాదం, ఈ రెండూ మేళవిస్తేనేకాని, ఉత్తమ కవిత ఆవిర్భవించదు. వాస్తవ, కల్పనల సమష్టి రూపకల్పనయే ఉత్కృష్టకవిత, విఖ్యాత ఐరిష్ కవి, భారతదేశవాసి అయిన జేమ్సు కజిన్సు అంటాడొక చోట :

' When we think of a poem we do not think of it as something which has been plucked from the tree' or gathered on a sea shore, or dug from a mine. We think of it as something that has been made by someone. We go even further; for we think of a poem as something which has a special character of its own, and which has been made by someone who has an equally special character. We call the maker of a poem a poet, and poets are supposed to be rare birds. Certain of the poems that poets have made have not died when their makers died; they have even outlived empires.

(మనం ఏదైనా కవితను గురించి ఆలోచిస్తున్నపుడు దాన్ని ఒక చెట్టు నుండి త్రుంచుకొచ్చినట్లుకాని, సాగర తీరంలో అది దొరికినట్లుకాని లేక దాన్ని ఒక గని నుండి త్రవ్వి తీసినట్లుగాని భావించం. అది ఎవరి చేతనో సృష్టించ బడినదని గ్రహిస్తాం. ఇంకొక అడుగు ముందుకు పోదాం. కవిత అంటే అదొక ప్రత్యేక గుణం కలిగివున్నదిగా భావిస్తాం. అదే ప్రత్యేక గుణం కలిగున్న ఎవరో వ్యక్తి దాన్ని తయారుచేశాడని కూడ భావిస్తాం. ఆ కవితను నిర్మించిన వ్యక్తిని మనం కవి అని పిలుస్తాం. కవులు అనేవారు చాలా అరుదైన పక్షులుగా ఎన్నబడతారు. కవితలను సృష్టించిన ఆ కవులు నశించినా వారు సృష్టించిన అనేక కవితలు ఇప్పటికీ నశించలేదు. సామ్రాజ్యాలు నశించినా కవితలు మిగిలే వున్నవి.)

కవి ప్రతిభను గమనించాలంటే దాన్ని కవిలో గమనించలేం, కవి రచించిన కవితలో గమనిస్తాం. స్రష్ట తన సృష్టిలో ప్రత్యక్షమవుతాడు. కవి రచించిన అన్ని కవితలూ సమాన స్థాయిలో వుండవు. అటువంటప్పుడు ఒక కవితలో కనిపించిన కవి మరో కవితలో భిన్నంగా కనిపిస్తాడు. అయినా, వాటన్నిటినీ రచించింది ఒకే కవి కనుక ఆ కవితల భిన్న రూపాల్లోకూడ ఒక ఏకత్వం తడుతుంది.

గోపాలరెడ్డిగారి కవితల్లో ఈ భిన్నత్వంలోని ఏకత్వం సుస్పష్టంగా కాక పోయినా, అస్పష్టంగా అయినా గోచరిస్తుంది. ఒకే కవి రచించి నప్పటికీ

ఆ కవితల్లో భిన్నత్వం గోచరించనపుడు కవి ప్రతిభను శంకించాల్సొస్తుంది. భిన్నత్వం లేంది వైవిధ్యం లేదు; వైవిధ్యం లేంది ఏకతానం ఏపిగిస్తుంది,ఇటువంటి లోపం ఈ కవితల్లో లేదనే తెలుస్తుంది ఈ కవితలను అనుశీలిస్తే.

ఈ కవి రంచించిన నాలుగవ కవితాసంపుటి"ఆమెనీడలు". ఈ సంటిపులో చాలా వైవిధ్యం వున్నది, వైచిత్ర్యం వున్నది, వున్నదికూడ నీడల ఔచిత్యం. బాహ్యప్రకృతి లోని నీడ మానవ ప్రకృతిమీద ఎంతో ప్రభావం చూపుతుంది. పకృతిలోని నీడ ప్రభావమే అంత బలీయంగా చూపితే ఇక ఆమె నీడ ప్రభావం మనిషిమీద ఎంత బలీయంగా చూపుతుందో : పీడను గురించి కవి అంటారు:

చంద్రుని నీడ
అమావాస్య దేహముపై పడితే
సూర్యగ్రహణ మగుతుంది
భూమిమీద
పౌర్ణమి వదనముపైపడితే
చంద్రగ్రహణ మవుతుంది.
ఆమె వలపు నీడ
నా మీద పడితే
కరగ్రహణ మవుతుంది
వికసిస్తే పాణిగ్రహణ మగుతుంది."

ఈ నీడల క్రమచిత్రణ సూర్యగ్రహణంతో బయలుదేరి పాణిగ్రహణం లోకి పరిణతి నొందింది :

జీవితంలో ఎండకున్న విలువ తక్కువదికాదు; కాని నీడకున్న విలువ ఎక్కువది. మనిషి ఎంతోసేపు వుండలేడు ఎండలో, నీడలో వుండగలడు ఎంత సేపైనా, ఎండ కాంతినిస్తే నీడ ఇస్తుంది శాంతిని. అయితే, కాంతిలేని శాంతి కాని, శాంతిలేని కాంతికాని అంత వాంఛనీయాలు కావు. కాంతిలేని శాంతి శైత్యాన్నికాని, శాంతిలేని కాంతి నైశిత్యాన్ని కాని సహించటం కష్టం.

ఈ సంపుటిలోని మొదటి కవిత విషాదపు నీడను సృష్టిస్తుంది. దీన్ని చదివిన పాఠకుడు తనకు తెలియకుండానే 'అయ్యో' అనేస్తాడు. ఈ కవితలోని నీడ ముదిరి చీకటి అయింది.

"ఆమె అవివాహితగనే చనిపోయింది
తృషిత ప్రేమికులకు దొరకక దాచిన
యౌవన అధర మధురిమల
నేడు సమాధి పర్యంకమున
క్షుధిత కీటకములకు అందిచ్చింది."

ఎంత హృదయ విదారకఘటనో ఇది ! ఆమె యౌవనమంతా అనాఘ్రాతపుష్పంగా, అనావిద్ధరత్నంగా, మానవ ప్రణయానికి దూరంగా వుండిపోవటం చివరకు సమాధిలో కీటకాల చేత ఆహారంగా ఆరగించ బడటానికా ? ఘోరం ! ఈ కవిత ఒక గొప్ప విషాదాంత నాటిక ! దీని నీడలు ఉల్లం గోడలపై చెరగని నీలిముద్రలు వేస్తుంది. మానవ జీవితంలో విషాదమే లేకుంటే ఇక ఆనందమే విషాదం అవుతుంది !

విషాదం ఆనందంలోకి దూపొందితే సహించ వచ్చుకాని ఆనందం విషాదంలోకి దూపొందితే సహించలేడు మనిషి.

శ్రీమతి సరోజనీనాయుడు సరసకవయిత్రి. ఆమె సంభాషణల్లో చమత్కారాల స్రవంతులు ప్రవహిస్తుండేవి. ఈ కవి ఆమెకు సంబంధించిన ఒక చమత్కార సన్నివేశం మీదకూడ ఒక కవిత వ్రాశారు :

"'నీపాదాలు ముద్దిడడానికి వచ్చాను
అని ఉర్దూ మర్యాదలో అన్నాడు పెద్దాయన లక్నోలో
పెదవులు ఏమి తప్పుచేశాయి
అన్నది చలోక్తిగ సరోజనినాయుడు.''

పెదవులున్నవి ముద్దు పెట్టుకోవడానికీ, ముద్దు పెట్టించుకోవడానికీ. అటు వంటప్పుడు పెదవులను వదలేసి పాదాలను ముద్దు పెట్టుకోటం ఏమిటి ? పాదాలను పాదాలతో ముద్దుపెట్టుకోరు; పాదాలను ముద్దు పెట్టుకొన్నా

కూడ పెదవులతోనే : అటువంటప్పుడు పెదవులతో పెదవులనే ముద్దు పెట్టుకోటం సమంజసం : పాదాలను పెదవులతో ముద్దు పెట్టుకొంటే అవతలి వ్యక్తిని గౌరవించినట్లు, పెదవులతో పెదవులను ముద్దిడుకుంటే అగౌరవపరచినట్లు కాబోలు. ఒకరి పెదవులు మరొకరి పాదాలకు అంటటం అంటే మానవతకు ఎంత అమర్యాదో, ఎంత అవమానమో : అయినా, కొన్ని సంప్రదాయాలు అగౌరవాన్నే గౌరవంగా చూస్తవి. అవమానాన్నే సమ్మానంగా భావిస్తవి.

అన్నిటికీ కాకపోయినా, కొన్ని సంప్రదాయాలకు మానవత్వం బలి :

గోపాలరెడ్డిగారు తమ కవితల్లో ఎటువంటి సంఘటనలనూ కూడ వదలలేదు. వాస్తవ రూపంలోని నీరస సంఘటనలు, నీరస వ్యక్తులు, నీరస ప్రదేశాలు కూడ కవితల్లోకెక్కి సరసం అవుతవి అనే సత్యాన్ని చరితార్థం చేశారు.

తెలుగులో కొన్నిపదాల సామ్యంవల్ల కొన్ని వస్తువులకు దగ్గర సంబంధం ఏర్పడుతుంది. సామాన్యంగా, వినటం చూడడమనేవి ముఖ్యం. అందువల్ల కంటికీ చెవికీ దగ్గర సంబంధం. కాని చూడటం, వాసన చూడటం అనే సామ్యంగల పదాలు కంటికీ ముక్కుకూ దగ్గర సంబంధాన్ని ఏర్పరుస్తవి. కన్ను చూస్తుంది మందారాన్ని, ముక్కు వాసన చూస్తుంది మల్లెను. ''ఆమెనీడలు''లోని ఈ క్రింది కవిత :

"సౌందర్య వైభవాలను
వింటేచాలదు, చూడాలె
కొన్ని పువ్వులను
చూస్తేచాలదు, వాసనచూడాలె."

సంగీతాన్ని వింటే సరిపోతుంది; కొండలను చూస్తే కాని సరిపోదు; మల్లెపూవును చూచినా సరిపోదు, వాసన చూడాలి. తెలుగులో చూడటం అనే మాటలతో అంతమయే క్రియ మరొకటున్నది, రుచి చూడటం. అరటి పండును చూచినా చాలదు; వాసన చూచినా చాలదు; రుచి చూచినప్పుడు కాని సరిపోదు.

చూడటం అనేసి దృశ్యానికి సంబంధించిన క్రియ. వాసన చూడటం, రుచి చూడటం అనేవి దృశ్యానికి సంబంధించినవి కావు. అయినప్పటికి ఆ రెండూ చూడటం అనే దృశ్యాత్మక క్రియను ఎందుకు కలుపు కొన్నవో ?

ఈ కవి వ్రాసిన అయిదవ కవితా సంపుటి "ఆమె తళుకులు". ఇందులో క్రిందటి పుస్తకాలలో కంటే వ్యావహారిక అనుభవాలు. వాటికి సంబంధించిన జ్ఞాపకాలు ఎక్కువ వున్నవి. అంటే వీటిలోనివి ఎక్కువ లౌకిక ఘటనలకు సంబంధించినవి.

కవి అయినా, మరో కళాకారుడైనా మనిషి మనిషే. భూమిని వదలి ఎక్కువకాలం ఆకాశంలో విహరించలేడు. తనను పీడించే దైనందిన బాధలను వదలి ఎక్కువ కాలం తాను నిర్మించుకొన్న మనోమయ ఆనందవాటికలో సంచరించలేడు. కనుకనే కవితల్లో కూడ లోక వాతావరణం వ్యాపించకుండా వుండదు. ఇందులోని ఈ క్రింది కవితలో అటువంటి వాతావరణం తొంగిచూస్తుంది.

"ప్రధానమంత్రి నిర్ణయించ లేకున్నది
ముఖ్యమంత్రికి సంతోషమే గదా అని అడిగింది.
మెడను సగము కోసి
చావకుండ బ్రతకకుండా ఉంచినట్లుంది అన్నాను నేను."

మరో కవిత :

"మద్రాసులో ఏమి చూడాలె
అని ఉత్తర భారతీయుడు అడిగితే
విశాల సుదీర్ఘ సముద్రతీర సైకతాలు
శ్రీమతి సుబ్బలక్ష్మి సంగీతము
శ్రీమతి కమల భరతనాట్యము
అని అన్నాను మద్రాసు మంత్రిగ."

ఇటువంటి కవితలు రసాత్మక కవితలు అనిపించుకొంటవా ? ఇవి విషయ ప్రాధాన్య కవితలు. వీటిలో అనుభూతికంటే భోగట్టా అధికంగా

వుంటుంది. ఇటువంటి విషయాలను కవితలో కాకపోయినా చెప్పవచ్చు. కాని కొన్ని విషయాలను కవితల్లో మాత్రమే చెప్పటం కుదురుతుంది. అవీ ఇవీ అన్నీ కవితలే. కాని సందర్భాన్నిబట్టి కొన్ని ఎక్కువ రసాత్మక కవితలుగా, మరికొన్ని ఎక్కువ వ్యావహారిక కవితలుగా చలామణి కావటం జరుగుతుంటుంది.

పై కవితలకూ ఈ క్రింది కవితకూ భేదమెక్కడ ? ఆ భేదానికి విలువ వున్నదా ?

''ఎడారిలోని మంచుబొట్టు
సుదూర సముద్రాల తరంగాలలో
మారపు చుట్టరికమున్నదని
వేకువ కలలు కంటూ వుంటుంది.''

ఈ కవితకంటే వెనకున్న కవితలు నిత్యజీవితంలో, దైనందిన వ్యవహారాలతో ముడిబడి వుంటవి. అందువల్ల వాటిలో ఆకర్షణ తక్కువ వుంటుంది. వాటి తరువాత వున్న ఈ పై కవిత నిత్యజీవితంలో నిత్యమూ కనిపించక దూరంగా జరిగి వుండటంలో దానిలో ఆకర్షణ ఎక్కువ వుంటుంది ఆకర్షణ దేనిలో ఎక్కువ వుంటుందో అది ఎక్కువ రసాత్మకంగా వుంటుంది.

ఈ రెండు వర్గాల కవితల మధ్యా వున్న భేదం విలువైనదా అనే ప్రశ్నకు జవాబు దొరకటం అంత తేలిక కాదు జీవితంతో ముడిబడి వున్న కవితకే విలువ కాని జీవితాన్నుండి దూరమైపోయిన కవితకు విలువేమిటి అనే వర్గం ఒకటైతే. రోజూ మనచుట్టూ చూస్తున్న జీవితాన్నే తిరిగి కవితలో చూస్తే విశేషమేముంటుంది. ఏది నిత్యజీవితంలో సన్నిహితంగా గోచరించదో దాన్ని కవితలో చూపటంలో, చూడటంలో విలువవుంటుంది, ఆనందముంటుంది అనేది మరో వర్గం.

మొదటిది ఎక్కువగా స్థూలప్రయోజనానికి సంబంధించింది; రెండవది సూక్ష్మఅనుభూతికి సంబంధించింది. ఒకటి ఉపయోగాన్ని అధికంగా ఇస్తే రెండవది అనుభూతిని ఎక్కువగా కలిగిస్తుంది. కనుక కొందరు

పాఠకులకు ఒకటి నచ్చితే ఇంకొందరకు రెండవది నచ్చుతుంది. కనుక రెండూ అవసరమే. ఈ అర్థంలో పరిశీలించి చూస్తే ఈ రెంటికీమధ్య వున్న భేదం అంతగా విలువైంది కాదని తేలుతుంది.

ఇందులోని మరికొన్ని కవితలు మరో విధంగా ప్రేమజగత్తును గురించి వ్యాఖ్యానిస్తుంటవి.

"ప్రేయసి అందరాని
అందముగానే వుండాలె
ప్రేయసి తాళి కట్టితే
కవితాఝురులు ఇంకిపోతాయి.''

ఇదే మాదిరి మరో కవిత :

"ప్రేయసి కల్పనా ప్రపంచపు
ఆకర్షణగానే వుండాలె,
చేతికి అందక
హృదయానికి మాత్రమే
అందుతు వుండాలె.''

దూరం అనేది దగ్గరలో కొచ్చేవరకు దాని ఆకర్షణను పోగొట్టుకొని సామాన్యం అయిపోతుంది. ఆదర్శం వాస్తవంగా మారేవరకు చప్పబడి పోతుంది. అందంది అందుబాటులోకి వచ్చేవరకు అందులోని అందం లోపిస్తుంది, ఆనందం నశిస్తుంది. ప్రేయసి గృహిణిగా తన నివాసంలోకి ప్రవేశించే వరకు మాధుర్యంలో చేదు తగల ప్రారంభిస్తుంది.

అందుకని గృహిణి లేకుండా ప్రేయసితోనే జీవితం గడపటం, అందని దాన్ని అందుకోకుండా వుండటం, ఆదర్శాన్ని వాస్తవంలోకి మారనీయకుండా వుంచటం, దూరాన్ని దగ్గరలోనికి రానీయకుండా చూడటం మొదలైనవి వాంఛనీయాలా? కాదు.

ఈ రెండు మార్గాలనూ పూర్ణంగా అనుసరించక దానిలోది కొంతా దీని లోది కొంతా మిళితంచేసి మూడో మార్గమైన మధ్యేమార్గాన్ని అనుస

రించటం వాంఛనీయం. వాస్తవమార్గానికది ఆదర్శమార్గంగా కనపడాలి. ఆదర్శమార్గానికి వాస్తవమార్గంగా !

'ఆమె' పేరుతో మొదలైన నాలుగు సంపుటులలోని చురుకుగల హ్రస్వ కవితలు. వాటిలో కథ వుండదు, ఘటన లుండవు; అవి కేవలం భావాభి వ్యక్తులు; అవి భావవైచిత్రిగల చిన్న చిన్న సూక్తుల (epigrams) లాంటివి.

ఈ సంపుటి అయిన "సాహిత్యసుందరి"మరో విధమైంది. ఇందులోని కవితలు హ్రస్వాలు కాక దీర్ఘాలైనవి. ఏ కథనో, గాథనో, ఏ ఘటననో, ఘట్టాన్నో ఈ కవితలు ప్రదర్శిస్తవి. ఈ కవితల్లో గోపాలరెడ్డిగారు ఎక్కువగా కావ్య భాషను ఉపయోగించారు. వీటిలో కొంత ప్రౌఢత్వం గోచరిస్తుంది.

సాహిత్యసుందరిలోని ప్రథమ కవితలో అసలు కవిత్వమయ విషయానికే రూపరేఖలు ఇచ్చారు. మహాభారతంలోని ఇతిహాసగాధయినట్టి, కాళిదాసు చేతిలో కమనీయ కళాఖండంగా రూపొందినట్టి శకుంతలగాధను తీసుకొని ఈ కవి తన స్వీయ శైలిలో రూపకల్పన చేశారు.

ఈ "శకుంతల"లోని కొన్ని పంక్తులు విశిష్టవ్యక్తిత్వం కలిగివుంటవి; భూలోకంలో తపస్సు చేసేవారికి తపోభంగం కలిగించాలని దేవేంద్రుడు నిరంతరం ఆలోచిస్తుంటాడట; భూలోకంలోని తాపసుల తపం ఫలిస్తే తన దేవేంద్ర పదవి వూడిపోతుందని ఆయన భయం. ఈ విషయాన్నే ఈ కవి రసమయంగా చెప్పుతారు:

"తపమును చెడగొట్టాలని ప్రయత్నం
ఎప్పుడూ అదే ఆలోచిస్తూంటాడు
అన్నీవదలి అరణ్యాలు చేరినా
కామంమాత్రం వారిని వదలదు
ఆగుట్టు దేవేంద్రునికి బాగాతెలుసు."

భూలోకంలోని అరణ్యాల్లో తపస్సుచేసే తాపసుల శక్తిసామర్థ్యాలను గురించి దేవేంద్రునికి ఎంతవరకు తెలుసోకాని వారి బలహీనతల్లో కల్లా ప్రధాన బలహీనత కామం అని ఆయనకు తెలుసు ; అందుకే తపస్సు చేసే విశ్వామిత్రుని వద్దకు మేనకను పంపేడు.

"విశ్వామిత్రుని మీదకు మేనకను ఉసికొల్పాడు సురవేశ్యలకు అలవాటైన ఉచ్చుల పన్నింది. క్రమ్ముకొన్నది, కవ్వించింది, ఆడింది ఎవరెస్టు శిఖరం ఎక్కి జెండానాటినట్లు గర్భంతాల్చి విజయపతాకను ఎగరేసింది."

నైరూప్య భావాలకు కవితారూపం ఇవ్వకలిగినంత ప్రతిభతో ఇటువంటి గాధలకు కూడ కవితారూపాన్ని ప్రసాదిస్తారు ఈ కవి. మేనక విశ్వామిత్రుని తపోభంగం కావించటం కొద్దిమాటల్లో రక్తికట్టింది.

ఇక శకుంతల బాల్యం గురించి మనోజ్ఞంగా కవితలల్లారు. ఆమె ఆటలు, పాటలు, మాటలు, ఆమెయడల కణ్వమహర్షి వాత్సల్యం, అన్నీ కవితా రూపం తాల్చినవి మధురంగా. అందరి మన్ననలనూ అందుకొనేది శకుంతల.

"అందరి ప్రేమల పొందుచు
ఆశ్రమ మంతా అలరించేది,
తల్లిపోలికలు వచ్చాయి
స్వర్గపు వెలుగులు వెలిశాయి
వెలుగు బంతివలె తిరిగేది
సెలయేటి నవ్వుల నవ్వేది
వెన్నెల ముద్దవలె, వెన్నముద్దవలె
అందంగా లతవలె వుండేది,
తియ్యని మాటలు చెప్పేది
కదలికలేని ఆశ్రమములో
ఆనందపు కదలికను కూర్చింది."

ఈ విధంగా "శకుంతల'' కవితలో ఎన్నో ఆకర్షక చిత్రణలు. గోపాల రెడ్డిగారి కొన్ని మాటలకూర్పులు ఇందులో రమ్యంగా వున్నవి. ''లత లతాంగిగ తేలింది" అనే ప్రయోగం ఎంత ఇంపుగా వుందో ! వీరి రచనల్లో యమకం (Alliteration) బాగా శోభిస్తుంది. వింతగా వుంటవి వీరి స్వంత ప్రయోగాలు. "శిరోజాలు చీకటి వాగులయ్యాయి." చీకటి వాగులు అనేది నూతనంగా ఎంతో వినసొంపుగా వున్నది. శపించటం అంటే ఈ కవిమాటల్లో "మండిపడి ముక్కుమీది కోపమును నాలుకమీదకు తెచ్చుకొని'' అని. ఇది దూర్వాసుని స్థితి, తపాలుచేయటం శాపబాణాలను పొందటానికేనా అని వాపోతారు ఈ కవి.

శకుంతల ఏ ఆధారంలేని స్థితిలో గాలిలోని దీపం వలె వుండి పోతుంది ఎవరికీ చెందకుండా. ఎటుచూచినా కూడ ఆమె జీవితం ఎడారిగా మిగిలిపోయింది. ఈ దిక్కులేని దీనావస్థను కవి ఎంతో కరుణాత్మకంగా శబ్దచిత్రం రచిస్తారు :

''జీవితమంతా కన్నీటికాల్వలే
తండ్రివద్దంటే, తల్లివదిలేస్తే
మునిశపిస్తే, భర్తకాదంటే
మిగిలిందేమి జీవితంలో !"

ఈ కవిచేత నిర్మించబడిన కవితా ఖండికల్లో "శకుంతల'' ఒక ఉజ్వలమైన పాలరాతి శిల్పం.

ప్రాచీన విషయాన్ని తీసుకొని ఆధునిక కవితగా మలిచి కమనీయంగా చూపటం అంతతేలిక పనికాదు. అయినా, ఆయనచేతిలో ఆ శిల్పమూర్తి జీవాన్ని పోసుకొని సజీవమూర్తి అయింది. కవి ప్రతిభవల్ల, కవితా లావణ్యం వల్ల !

ఈ సంపుటిలో ఎన్నో విషయాల్ని స్పృశించి చూచారు కవి. వాటిలో "ప్రకృతి'' అనే దొకటి. కవి మానవుడు కనుక మానవులను గురించే ఎక్కువ వ్రాయబడింది. మానవులను చిత్రించిన దక్షతతోనే ప్రకృతిని కూడ చిత్రించారు :

ప్రకృతి మానవునికి వ్యతిరేకమైన అస్తిత్వం కాదు. మానవజీవితం లోని ఆ భావాన్ని ప్రకృతిలోని లోపాన్ని మానవుడూ తీరుస్తారు. ఈ రెండూ పరస్పర పూరకాలు (Complemetorics) మాత్రమే కాని వ్యతిరేకాలుకావు. ఈ క్రింది కవిత :

"వెలుగున్నచోటే నీడ
చీకట్లో నీడలేదు,
పౌర్ణానికే గ్రహణం
ఇతరరాత్రులకు లేదు
అమావాస్య పగలే గ్రహణం
ఇతర పగళ్లకు పట్టదు.
ఏమీ ఈ నియమాలు."

మరో కవిత :

"అగ్నికి ఎప్పుడూ ఊర్ధ్వ దృష్టే
నీళ్లకి అధోదృష్టి
వాయువుకు సమదృష్టికాబోలు."

కవిత్వం అనుభూతి ప్రధానమంటారు. ఆదికవి వాల్మీకి క్రౌంచపక్షుల జంటలోని ఒక పక్షిని కిరాతుడు చంపటం చూచి కరుణానుభూతిని పొంది

"మానిషాద ప్రతిష్ఠాంత్వమగమః శాశ్వత్ సమాః
యత్ క్రౌంచమిధునాదేకమవధీః కామమోహితం"

(ఓ కిరాతుడా, కామమోహితమైవున్న క్రౌంచ మిధునంలోని ఒకదాన్ని చంపేవు కనుక శాశ్వతంగా నీవు ప్రతిష్ఠను పొందకుందువు గాక).

నిషాదునికి వాల్మీకి చాలా మృదువైన శాపాన్ని మాత్రమే ఇచ్చాడు. ఆ నిషాదుడిని కేవలం ప్రతిష్ఠనుండి మాత్రమే దూరంచేశాడు. వాల్మీకి ఎంతవరకు ఆది కవి అని తేల్చాలసింది చరిత్రకారులు. వాల్మీకికి ముందు ఎవరూ కవితారచన చేయలేదా ?

కవితారచనలో అనుభూతిది గొప్పస్థానమే కాని ఆలోచనది తక్కువ స్థానం ఏమీ కాదు. ప్రాచీనులే అన్నారు, సంగీతం సాహిత్యం రెంటిలో ఒకటి మధురమైంది అనీ, రెండవది ఆలోచన అనీ, "ఏక మాపాత మధురం త్వన్యదాలోచనా మృతం" అని. ఆనాటి సాహిత్యం అంటే కవిత్వం అనే అర్థం. అసలు ఆదిమ సాహిత్యంలో పద్యమే తప్ప గద్యం లేదని, పద్యం ముందుది, గద్యం తరివాతది.

ఆధునిక కవితలో ఆలోచనకు ఎక్కువ విలువున్నది అనుభూతికంటే. అందుకే అంటారు, ఒకప్పుడు కవితలు పాడటానికి పనికి వచ్చేవని, తరువాత అవి చదవటానికి పనికి వచ్చేవని, నేడు అవి ఆలోచించ టానికే పనికి వస్తున్నవని.

ఈ కవి కవితా సృష్టిలో ఆలోచన ఎంతగానో ప్రాధాన్యం పొందింది అనుభూతికితోడు. ఈ కవితల్లో ఆలోచన ఎక్కువుందా అనుభూతి ఎక్కువుందా అని తేల్చటం కష్టం. అసలు వీటిలో ఏది అనుభూతి ఏది ఆలోచన అని గ్రహించటం కూడ కొన్నిచోట్ల కఠినంగానే వుంటుంది. ఏమరుపాటున ఒకోసారి ఆలోచననే అనుభూతిగా, అనుభూతినే ఆలోచనగా భ్రమచెందటం కూడ జరుగుతుంటుది. ఈ క్రిందిదాన్ని ఆలోచనా కవిత అనవచ్చు.

"ఒకటిలో సృష్టిలేదు
'అద్వైతం'లో సృష్టిలేదు
'ద్వైతం' కావాలె.
కనీసం రెండుకావాలె
మగ ఆడ కావాలె,
రెండు మగలలో సృష్టిలేదు
రెండు ఆడలలో సృష్టిలేదు
మగ ఆడల ద్వైతంకావాలె,
దాన్నే పురుషుడు ప్రకృతి అన్నారు."

ఆలోచనా కవిత ప్రధానంగా భోగట్టానిస్తుంది, నూతన సత్యాలను చూపుతుంది. పొరలను విప్పి చూస్తుంది, భ్రమను తొలిగిస్తుంది.

అనుభూతికవిత హృదయ స్పందనను కలిగిస్తుంది, ఏడ్పిస్తుంది, నవ్విస్తుంది, క్రోధాగ్నిని రేకెత్తిస్తుంది, ప్రశాంతిని కలిగిస్తుంది, భ్రమమ సృష్టిస్తుంది. ఈ క్రిందిది అనుభూతికవిత :

''హతాశ అయిన నటీమణిని,
ఒకనాటి అందాల రాణిని,
అందరికంటె మిన్నగ నుండిన అభిమాన తారను,
జీవితము
ఎండ మావుల మైదానమని
ఇంద్రధనస్సుల ఆకాశమని
సొలెపురుగుల సన్నని గూడని
ఎన్నడును అనుకొని వుండలేదు
ఆమె.''

వ్యాసరచనలో అలోచన మాత్రమేవుండదు, అనుభూతికూడ వుంటుంది అదే విధంగా కవితలో అనుభూతి మాత్రమేకాక ఆలోచనకూడ వుంటుంది.

అయినా, ఇటువంటి విశ్లేషణ, వర్గీకరణ మొదలైనవి సమీక్షకుని మెద డులో జనిస్తవికాని రచించే సమయంలో కవి హృదయంలో జనించవు. ఇటువంటి తర్కం, చర్చ కవికి కవితా రచన ఘడియల్లో జనించినదా అంటే కవితలో రసా విర్భావానికి బదులు రసాభాస మాత్రమే ప్రత్యక్ష మవుతుంది ; కవిరచిస్తున్నప్పటి ఘడియలు సృజనాత్మక ఘడియలేకాని సమీక్షాత్మక ఘడియలు కావు.

ఈ ''సాహిత్యసుందరి''లో ముందుగా వ్రాసుకొన్న కవిగారి ''విన్న పము''లోని ఈ క్రింది రెండు వాక్యాలు రమ్యంగా వున్నవి, ''కవితా సభలోకి వచనకవిత్వాలతో ఆలస్యంగా వచ్చిన నన్ను కూర్చోమని చెప్పారు. వెళ్ళిపొమ్మనిమౌనంగానో సైగలతోనో తిరస్కరించలేదు.''

అప్పుడు కాని ఆయనకు ఆత్మవిశ్వాసం బలపడలేదు. అప్పటిపరకు తాను కవిని కాదేమో, తనవి కవితలు కావేమో అని ఆయనకు సందేహం. కవిని కొలవటానికి వున్న కొలతబద్ధ ఏమిటో, కవితలను నిర్ధరించటానికి గీటురాయి ఏమిటో ఆయనకు తెలియవు అప్పటికి.

ఏవేమో వాక్యాలు తలలోకి వస్తున్నవి, వాటిని కలంతో కాయితం మీదకు ఎక్కిస్తున్నారు; అంతే చుట్టూవున్న విజ్ఞుల ప్రోత్సాహం దొరికేంత వరకూ కూడ తనవి కూడ కవితలే అనీ, అందులో కొన్ని నిజంగా ఉత్తమ కవితలే అనీ గోపాలరెడ్డి గారికి అంతు పట్టలేదు: ఇతర్లు కవులో కారో తెలుసుకోటం సులభం, ఇతర్లవి కవితలు అవునో కాదో తెలుసుకోటం సులభం, కాని తాను కవిననీ, తనవి కవితలనీ ప్రారంభంలో తెలుసుకోటం అంతసులభం కాదు.

అయినా, ఒకే వాస్తవం అందరకూ సమానంగా వర్తించదు. తాను కవిని అయినా, కానేమో అని సందేహించటం కొద్ది మందిలో వుంటే, తాము కవులు కాక పోయినా అవునని నమ్మటం ఎక్కువ మందిలో వుంటుంది! మొదటి దానిలో ప్రమాదంలేదు కాని రెండవ దానిలో ప్రమాదం.

ఒకవేళ గోపాలరెడ్డిగారి జీవితంలో కూడ ఒకప్పుడు ఈ రెండవది కూడ సంభవించినదేమో తెలియదు. కవిఅయినతరువాత తాను కవిని కానేమో అని సందేహించినట్లే తాను కవికాకముందు తాను కవిని అని నమ్మి వుంటారేమో! అయిన దాన్ని కాదు అనుకొన్నప్పుడు, ఆ అనుకోక ముందు, కాని దాన్ని అవునని అనుకొని వుండవచ్చేమో.

సరే, ఏది ఏమైనా, నేడు గోపాలరెడ్డి గారు సరసకవి, ఆయన రచించినవి సరస కవితలు, సందేహంలేదు. ఆయన కవితల్లో కవిత్వం వుంటుంది, జీవన తత్వం వుంటుంది, వ్యక్తిత్వం వుంటుంది. ఇవి వుంటే చాలు, ఇంకేమీ వుండవసరంలేదు. నాలుగేళ్ళలో సంపుటాల మీద సంపుటాలు సాగర తరంగాల వలె కవితా మంజరితో నిండి బయటికి వస్తున్నవి. అవి అశేషపాఠకులకు కవితానందాన్ని పంచిపెడుతున్నవి.

గోపాలరెడ్డిగారి ఏడవ కవితా సంపుటి ఇది; దీనిపేరు "ప్రసూనమంజరి' ఇందులోని కవితలు కొన్ని గంభీర విషయాలకు చెందినట్టివి. "మరణానంతరం", "ఆత్మజ్ఞానం'', ''గంగోత్రిశిల", "విప్లవం'', "గంగాయమునలు'', "మృత్యువు", ఇంకా ఇతరమైనవి.

మృత్యువు అంటే ఎందుకు అంతభయమో, అదంటే ఎందుకంత యిష్టమో కవిమనోజ్ఞంగా వివరించారు :

"మృత్యువంటే అందరికీభయం
ప్రపంచాన్ని వీడి, అభ్యాసములైన విషయాలను వదలి
బంధుమిత్రులకు దూరంగా
ఎక్కడికో తెలియరాని మిన్నులకు వెడలటం
ఊగ తెలిసిన నాటనుండి పెంచి పోషించిన దేహము
అగ్నికీలలో భస్మంకావడం
రోగ వేదనాలు, పాడె ఊరేగింపులు
చిత్రగుప్తుని లెక్కలు, నరక చిత్రహింసలు
అన్నీ మనస్సులో మెదులుతాయి
సంజమసకల్లో దూరంగ
నడియాడే అస్పష్టమూర్తులవలె
తనులేని ప్రపంచం తనకు ఎరుక లేదు
.... .... .... .... .... .... .... .... .... ....
తాను ఊదుచుండిన దేహమురళి
రమ్యగీతాల ఇక వినిపించదు
.... .... .... .... .... .... .... .... .... ....
చితాసనముపై
తిమిరనీల మకుటముతో
కారివే హస్తదండముగ
శవగంధధూమపతాకముతో
మృత్యుదేవత అమరినట్లు భయపడుతుంటాము."

"తాను ఊదుచుండిన దేహమురళి'' ఎంత రమ్యంగా వున్నదో ఈ ''దేహమురళి'' అనే సమాసం ; ఈ కవి వాడుకలో లేని పరిక్రాంత స్వంత సమాసాలను సృష్టించుకోటంలో కడునేర్పరి. ''తిమిరనీల మకుటం'', "శవగంధధూమ పతాకము" మొదలైన ఇంకెన్నెన్ని విలక్షణ సమాసాలో ఆయన సృష్టించినవి వాటికవే సాటి !

"మృత్యువు" అనే పై కవిత విషయం లోను, కవితా శిల్పంలోను విశిష్టంగా, గంభీరంగా, గభీరంగా వున్నది. "సంజమసకల్లో దూరంగ నడయాడే అస్పష్టమూర్తులవలె'' అన్న దృశ్యచిత్రణను చదివితే అనిపిస్తుంది ఈ కవి నిపుణ శబ్ద చిత్రకారుడని !

''మృత్యువు'' అనే కవితమాత్రమే కాక "మరణానంతరం'' అని కూడ ఒక కవిత వున్నది ఈ సంపుటిలో. ''మృత్యువు"అనే కవిత వర్తమానానికి చెందితే "మరణానంతరం'' అనే కవిత చెందుతుంది భవిష్యత్తుకు. మృత్యువంటే ఏమిటో కొంతవరకు తెలుస్తుంది. తెరిచి వున్న కళ్ళు మూతలు పడడం, కదిలే దేహం కదలక పోవటం, మాటలు మౌనంలోకి వెళ్ళిపోవటం గిచ్చితే నొప్పిలేకుండా పోవటం మొదలైన లక్షణాలు మృత్యువు అని తెలుస్తుంది. కాని మరణానంతరం గురించి అస్పష్టమైన పరోక్ష వివరణలు తప్ప మరేమీ తెలియవు. మృత్యువు తెర కీవలది, మరణానంతరం తెరకావలది. తెర కీవలది తెలుస్తుంది కాని తెర కావలది తెలియదు.

ఈ కవిత ''మరణానంతరం''లో కవి తెలిపింది మరణానంతరం ఏమి అవుతుందనే శాస్త్రాన్ని గురించి కాక మరణానంతర లౌకిక విషయాలను గురించి మాత్రమే.

''నలుగురు తలుస్తుంటే ఆత్మకు శాంతియని విశ్వాసం
స్మరణ సింహాసనముపై అమరుడుగ
కూర్చోవాలని అభిలాష
స్మరణ పథతోరణాల మధ్య
కీర్తికాయుల ఊరేగింపులు

బ్రతికి సుఖాన్ని కోరితే
చచ్చి కీర్తిని కాంక్షిస్తాడు
మరణం తధ్యమని తెలిసే
మరణానంతర కీర్తిని వెంటాడుతాడు.
.... .... .... .... .... .... .... .... ....
మరణవేదికపై అమరకీర్తిసుందరి
నాట్యము చేయాలని జీవన మృదంగము వాయిస్తాను.''

''జీవనమృదంగం'' అనే పదప్రయోగం నవ్యంగా, ఆకర్షకంగా వున్నది. అవును, బ్రతికున్నంతవరకు సుఖపడాలని కోరిక. సుఖానికి తోడు కీర్తినికూడ పొందాలని కోరిక వున్నా కూడ జీవితంలో సుఖం మీదనే ఎక్కువ ప్రీతి. కొద్దిమంది కీర్తికి సుఖాన్ని బలిచ్చి సుఖంకంటే కీర్తినే ఎక్కువ కాంక్షిస్తారు. కాని సాధారణంగా మాత్రం మానవులు జీవించివుండగా సుఖాన్నీ. మరణానంతరం కీర్తినీ వాంఛిస్తారు. అందుకే కీర్తిశేషులు కావటం అంటే మరణించటం, కనుక బ్రతికున్న మనిషి రెంటినీ సంపాదించుకోవాలి—సుఖమూ, కీర్తీ.సుఖం బ్రతికి వున్నన్నాళ్లూ అనుభవించటానికీ, కీర్తి చచ్చిన తరువాత అనుభవించటానికీ. దేనినైనా ప్రాణం వుండగా సేకరించుకోవలసిందే కాని ప్రాణం పోయిన తరువాత కుదరదు.

బ్రతికి వుంటే త్వరగా కీర్తి లభించకపోతే చచ్చి త్వరగా కీర్తిని పొందాలని కూడ కొందరు ఆకాంక్షిస్తారేమో తెలియదు ! కీర్తిని త్వరలో పొందాలంటే కీర్తిశేషులు కావటం దగ్గర మార్గమేమో ! తనను మరణానంతరం ఇతర్ల మరణానంతరం కాదు కనుక తన మరణానంతరం ఈ మర్త్యలోకంలో తనకు సంబంధించిన కార్యకలాపాలు ఏమి జరిగేవీ తనకు తెలియవు కాని బ్రతికున్న ఇతర్లకు తెలుస్తవి ! మనిషి తన మరణాన్ని తాను చూడజాలడు; ఇతర్ల మరణాన్ని మాత్రం చూడగలడు; ఇతర్లు తన మరణాన్ని చూడ గలరు.

సృష్టిలో జీవితానికెంత ప్రాధాన్యం వున్నదో మృత్యువు కూడ అంత ప్రాధాన్యం వున్నది, అంతకంటే ఎక్కువ లేకపోయినా.

అటువంటి ప్రముఖ విషయాన్ని తీసుకొని ''మృత్యువు'' అనీ, "మరణానంతరం'' అనీ రమ్యమైన రెండు దీర్ఘ కవితలను వ్రాయటం పరికిస్తే గోపాలరెడ్డిగారు కేవలం పూవులమీద, పూబోడులమీద మాత్రమే కాక, లతలమీద, లతాంగులమీదనే కాక, మృత్యువువంటి గహన విషయాల మీద కవితా రచన చేయటం ఆయనలోని లోతుల లోతును చూపిస్తుంది : మొత్తం మీద కొన్ని మెత్తని కవితలున్నా ఈ సంపుటిలో ఎక్కువ కవితలు మెత్తని కాని విషయాలకు సంబంధించినవే. మెత్తదనం ఎక్కువైతే వంగిపోతుంది, కఠినత్వం ఎక్కువైతే విరిగిపోతుంది. వంగకుండా, విరగకుండా వుండాలి : మానవ ఆదర్శం అదే

ఈ కవికి ఉపమలను వాడటం చాలా ఇష్టమైనట్టు గోచరిస్తుంది. ఒకటి రెండు మూడుతో మాత్రమే సంతృప్తి చెందక అది ఒక గొలుసుగా నడుస్తుంది. కొన్ని సందర్భాల్లో అది రక్తికడుతుంది. ఎప్పుడైనా రక్తి కట్టదుకూడ. ఈ సంపుటిలోని "పుస్తకాల గది'' అనే కవిత మొత్తం ఉపమాలంకారాల గది :

''ప్రొద్దుపోక బడలికగ పుస్తకాల గదిలో దూరాను
మాలిలేని తోటగ, అధిపతిలేని సైన్యముగ
పంతుళ్లు లేని బడిగ ఉండింది గది అంతా
చిందరవందరగ గజిబిజిగ ఉన్న
గదిని దండకారణ్యం అని పిలుస్తూ వుంటాను
వలసిన పుస్తకము సమయానికి దొరకదు
కోరి, కొన్ని పుస్తకాలు కోరక చేరిన పుస్తకాలు
ఒకటి నొకటి ఢీకొంటూ, ఒకటిపై ఒకటి పేరి వుంటాయి
దొంతరలగ నిలబడి వుంటాయి
రాసులుగ గుమికూడి వుంటాయి
అడివిలో పండిరాలిన ఆకులవలె
లంకాపురిలో రాక్షస మూకవలె
భూకంపంలో మడిసిన శవాలవలె వుంటాయి
చదివిన వానికన్న చదవనివే హెచ్చుగ వుంటాయి

వెలిగింపని దీపాలవలె
నీరు ఎరగని బీడులవలె.''

పై కవితలోని ఉపమలు ఎక్కడా అవాంఛనీయంగా లేవు. ప్రత్యేకించి ''అడవిలో పండిరాలిన ఆకులవలె'' ''వెలిగింపని దీపాల వలె'' అనేవి ఎంతో రమ్యంగా వున్నవి !

అడవిలో రాలిన పండుటాకులను గురించి చెప్పాలసొచ్చినపుడు అవి గోపాలరెడ్డిగారి గదిలోని పుస్తకాలవలె ఉన్నవి అని చెప్పవచ్చు, చంద మామ ఆ బాలిక వదనం వలె వున్నదన్నట్లు !

కవితల సంపుటిని దేన్నయినా చదివి వాటిలో ఎక్కువ బాగుండని కవిత ఏమిటని అడిగితే ఆ ఎక్కువ బాగుండని కవిత ఫలానిదని నిర్ణయించి చెప్పటం కష్టం. కాని వాటిలో ఎక్కువ బాగున్న కవిత ఏదీ అంటే నిర్ణయించి చెప్పటం కష్టం కాదు.

ఒకే రచయిత రచించిన రచలన్నీ సమానస్థాయిలో వుండవనేది అందరికీ తెలిసిన సామాన్య సత్యం. ఈ ''ప్రసూనమంజరి''లో ఏ కవిత ఎక్కువ బాగున్నదీ అంటే ఒకొక పాఠకుడు ఒకొకటి ఎక్కువ బాగున్నదని చెప్పటం సహజం. అదే ప్రశ్న సంజీవదేవ్‌ను అడిగితే ''ఆత్మజ్ఞానం'' అనే కవిత ఎక్కువ బాగున్నదంటాడు ఇందుకు కారణం అందులోని విషయం ఆత్మజ్ఞానం అనేది అయినందున కాదు. కవి ఆ విషయాన్ని చిత్రించిన రీతి, అందులో ప్రదర్శించిన పదావళి, భావావళి, మలిచిన కవితా శిల్పం మొదలైనవి మనోజ్ఞంగా వున్నవి.

''చూచినవే విన్నవే సత్యాలు కావు
చూడనివి విననివి మరింత సత్యాలు
మనపుట్టుక మనము చూడలేదు
చావు అంటే
అవి సత్యములు కావని అనగలమా
.... .... .... .... .... .... .... .... .... ....
వీపును మనము కాంచలేము

దాని అస్తిత్వాన్ని మనం శంకించలేము
ఏరు, కన్న కొండతల్లిని మరచింది
నిప్పు, కన్నతల్లి కడుపును కాల్చింది
గాలి ఎక్కడ పుట్టిందో ఎచ్చటికి ఏగుతుందో
నిరుద్దేశ్య నిరంతర ప్రయాణం
పిల్లనగ్రోవి గాలిని పోసుకొని
గాలిని మధురస్వరాలతో నింపుతుంది
వాయుపు హస్తాలతో పనిముట్టువేణువు
వేణువు మాటలుపోయిన పాటలను
విషాదంగ ఆనందంగ పాడి
హృదయాన్ని రసార్ద్రము చేస్తుంది
.... .... .... .... .... .... .... .... ....
తన నీడను చూసేదే జ్ఞాన నేత్రం
తన్ను అంటియున్న అల్పత్వాలను ఛాయలను
తెలిసికొనేదే ఆత్మజ్ఞానం."

ఇక్కడ కవి ఒక సున్నితమైన సత్యాన్ని పలికేరు ''మాటలు పోయిన పాటలు'' అని. మాటలున్న పాట పాటకాదు, అది మాటల కూర్పు మాత్రమే అవుతుంది. శుద్ధ సంగీతంలో నాదం మాత్రమే వుండాలి కాని మాటలు కాదు. మాటలున్నది 'కవిత' అవుతుంది కాని గానం కాదు. కనుకనే కవి ''మాటలు పోయిన పాట" అన్నారు ఎంతో సూక్ష్మ పరిజ్ఞానంతో, ఎంతో అంతర్వీక్షణంతో.

తనను అంటివున్న అల్పత్వాలను తెలుసుకోటాన్ని ఆత్మజ్ఞానం అన్నారు. ఇదిముమ్మాటికి నిజం. తనలోని గొప్పతనాన్ని తాను తెలుసుకో అవసరం లేదు, అవి దానంత అదే మనకు తెలుస్తుంది. తెలియనివల్లా అల్పత్వాలే. కనుక తన లోని అల్పత్వాలను తెలుసుకొన్నపుడే అది నిజమైన ఆత్మజ్ఞానం అవుతుంది. తనలోని 'మహతో మహీయాన్'ను మాత్రమే కాక 'అణోరణీయాన్' ను కూడ తెలుసుకొంచేనే ఆత్మజ్ఞానం. ఈ పరమ సత్యాన్ని గోపాలరెడ్డిగారు తమ కవితలో అభివ్యక్త పరచటం అభినందనీయం.

"పరిమళతరంగాలు" ఈ కవి వెలువరించిన కవితా సంపుటులలో ఎనిమిదవది. ఇందులో మూడు అనువాద కవితలున్నవి ఒకటి రవీంద్రుని వంగమాతృకనుండి, రెండు కవితలు ఇక్బాల్ ఉర్దూమాతృక నుండి. మిగతావన్నీ తెలుగులో రచించిన మౌలిక కవితలే.

ఈ కవితా సంపుటిలో ఎంతో వైవిధ్యం వున్నది. జీవితంలోని అనేక విషయాలు కవితలుగా రూపొందేయి. ఒక సామాన్య విషయాన్ని తీసుకొని దాన్ని పుటలకు పుటలుగా అల్లటం గోపాలరెడ్డిగారికి బాగా చేయి తిరిగిన కళ. ఎంత ఎక్కువ విషయాన్నయినా కుదించి వ్రాయటం కొందరికి అలవాటున్నట్లే ఈ కవివంటి కొందరికి ఎంత చిన్నవిషయమైనా విస్తరించి వ్రాయటం అలవాటు. కొందరు బ్రహ్మాండాన్ని అండాండంలోకి మడిచి చూపితే మరికొందరు అండాండాన్ని బ్రహ్మాండంలోకి పడతలు విప్పి విశాలం చేసిచూపుతారు.

రెంటిలో ఏది రమ్యంగా వుంటుంది అని ప్రశ్నిస్తే నిపుణ రచయితలు మొదటి పద్ధతిలో రచించినా రమ్యంగానే వుంటుంది. రెండవ పద్ధతిలో వ్రాసినా రమ్యంగానే వుంటుంది. అందుకు వ్యతిరేకంగా, నిపుణులు కాని రచయితలు ఆ రెంటిలో ఏ ఒక పద్ధతిలో రచించినా రమ్యంగా వుండదు.

ఈ కవి చేసిన కవితా వ్యవసాయాన్ని అనుశీలించి చూస్తే ఈయన నిపుణరచయిత అని విశదమవుతుంది. అందువల్ల ఈయన చీమను ఏనుగు చేసి చూపినా, ఏనుగును చీమ చేసి చూపినా రమ్యంగానే వుంటుంది. అయితే అనల్పాన్ని అల్పం చేసి చూపటంలో కంటే ఈయనకు అల్పాన్ని అనల్పం చేసి చూపటంలో ఎక్కువ ఆసక్తి. ఎక్కువ శక్తికూడ. కొంచెంతో తృప్తిపడే వ్యక్తికారు ఈ కవి. అంచులు దాటటంలో కాని తృప్తి చెందరు. కనుకనే, ఏమీ లేనిదాన్ని తీసుకొని ఎంతో వైశాల్యంలోకి దాన్ని రూపొందిస్తారు ఈయన!

ఈ సంపుటిలో "కావ్యఉపేక్షితులు" అనే ఒక ఖండిక వున్నది. ఇందులో రవీంద్రుడు, కావ్యపాత్రలలో కొందరికి, అంటే, లక్ష్మ

ణుని భార్య ఊర్మిళకూ, శకుంతల సఖీబృందంలోని వారైన అన సూయ ప్రియంవదలకూ, వరసగా వాల్మీకీ, కాళిదాసూ న్యాయం చేకూర్చలేదనీ, వారు అపాత్రలను ఉపేక్ష చేశారనీ అన్నట్లు వ్రాశారు. ఆ విషయాన్ని ఆధారంగా తీసుకొని ఈ కవి అంటారు :

"కావ్య సాహిత్యంలోనే కాదు
అట్టిఉపేక్షితులు కాన్పించేది
జీవన సాహిత్యంలోను"

.... .... .... .... .... .... .... ....

''చిన్ననాటి ప్రజ్ఞాపదచిహ్నాలను అనుసరిస్తు
పెద్దతనము కదలిపోతుంది
తొలినాటి మొగ్గలు పూయకనే రాలిపోతాయి
ఉన్నత శిఖరాలలో పుట్టిన సెలయేరు
మధ్యలోనే ఇసుక పర్రలలోకూరుక పోతుంది
ఎందరెందరు ప్రజ్ఞావంతులు
సేవాతత్పరులు, త్యాగధనులు సాధుశీలురు
సమాజ గౌరవమును
సమకాలీన ఆదరణను పొందలేక పొయ్యారో
తలచిన విచారమే కలుగుతుంది."

ఇది ఒక వర్గం. ఇక రెండోవర్గం వారుంటారు అయోగ్యులుగా వుండీ సమాజపు ఉచ్ఛ స్తరాలకు ఎక్కి గొప్ప వ్యక్తులుగా నటించేవారు. లేక గొప్పవ్యక్తులుగా నటించి సమాజపు ఉచ్ఛ స్తరాలకు ఎక్కేవారు. ఇటు వంటి వారిని గురించి కూడ ఈ కవితలోనే ఈ కవి అంటారు :

''దీనికి వ్యతిరేకముగ, మరి కొంతమందికి
రావాలసిన పేరు కన్న అధికంగానే వస్తుంది
సిద్ధికన్న ప్రసిద్ధి ఎక్కువగానే వుంటుంది''

ఇటువంటి రెండు విధాలైన మనుషుల్ని గురించికూడ కవి కవితా రచన చేశారు. మొదటి విధానికి చెందిన వారిమీద జాలి, రెండో విధానం వారి

మీద కోపం కలగటం సహజం. మొదటి వారిని సమాజం తింటుంది, రెండోవారు సమాజాన్ని తింటారు. ఉభయులూ కవికి అందుతారు!

రామరాజ భూషణుడు రచించిన ''వసుచరిత్ర'' మన కవికి చాలా ఇష్టం. ''వసుచరిత్ర'' అనేఖండికలో కవి అంటారు.

''ఏదో మంత్రదండముతో
శబ్దాల వశపరచుకొనెను.
శబ్దాల బరువుల లోతుల చూపించెను.
వంపులలో విరుపులలో ఒయ్యారాల బలికించెను.
లయ యుక్తముగ నృత్యనూపుర నిక్వణాలను వినిపించెను.
శ్లేషల ఆశ్లేషముల వినోదముల ప్రదర్శించెను.
శబ్దముగ్ధలతో నర్మభాషల నలిపెను.''

ఇదీ గోపాలరెడ్డిగారి స్వీయశైలి, స్వీయ కవితాశిల్పం. శిలాశిల్పాన్ని కవితా శిల్పంలోకి శిల్పించగల శబ్దశిల్పి ఆయన!

''ఆమె''పేరుతో శీర్షికలు గల కవితాసంకలనాల్లో వెలువడిన నాలుగు సంపుటాలకు తోడు ''ఆమె చెణుకులు'' అనే అయిదవది కూడ వెలువడింది కొంత వ్యవధితో. దీనితో''ఆమె''పంచకం పూర్తి అయినట్లు. జీవితానికి సంబంధించిన అనేక విషయాల వైవిధ్యత వైరుధ్యం లేకుండా ఇందులో కుసుమించినవి. ఇందులోనివి చాలావరకు ఉన్నత స్థాయికి చెందిన భావ పరిమళంతో వుంటవి.

''మరణరాజు ఛత్రచ్ఛాయలక్రింద
జీవితపు బానిస మనుచున్నాడు.
హఠాత్తుగా ఛాయలు మాయమగుతాయి
బానిస రోగశృంఖలాలలో నలిగిపోతాడు.''

మానవ జీవితం మర్త్యం అని చెప్పటంలో పై కవిత ఎంతో కవిత్వమయంగా చెప్పింది. రంగులేని సత్యాలను రంగుల్లో ప్రత్యక్ష పరుస్తాడు కవి!

"మేఘముల నర్తనీ బృందము
నృత్యము సలుపుచుండ
పర్వతములు కూర్చొని కొన్ని
పరుండి కొన్ని మోచేతులమీద
వాలికొన్ని పరికించుచున్నాయి."

ప్రకృతి శోభను వర్ణించటంలో పై కవిత మామూలు రీతిని దాటి ఒక నవ్యరీతిలో ప్రత్యక్షమైంది. గోపాలరెడ్డిగారి సృజనలో ప్రతిదీ పాతదనపు శృంఖలాల నుండి విముక్తమై ఏదో నవ్యకాంతిని అందుకో చూస్తుంటుంది.

నవ్యత్వాన్ని ప్రదర్శించటం మాత్రమే కావ్యరచనలోని ప్రధాన లక్షణం కాదు కాని నవ్యత్వాన్ని ప్రదర్శించటం కూడ వాటిలో ఒకటి.

"పుట్టుకకు తల్లి ప్రక్కవుంటుంది
తల్లికి భర్తవుంటాడు
చావుకు ఎవరూ అక్కర లేదు
ఏకాంతముగ చావొచ్చు

శ్మశానానికి మనుష్యులో వాహనాలో కావాలి." జీవి ప్రపంచంలో ప్రవేశించటంలో తోడువుంటుంది, ప్రపంచం నుండి శాశ్వతంగా దూరమైపోవటంలో తోడు వుండదు. శిశువు తల్లి గర్భంలో సృజించబడుతుంది, తల్లివడిలో పెరుగుతుంది. కాని మరణించటంలో ఎవరి సహాయమూ అవసరం వుండదు!

సాహిత్యోపన్యాసాలను గురించి ఇందులో చక్కగా చమత్కరిస్తారు కవి. ఇదొక వ్యంగ్య కవిత.

"సాహిత్యోపన్యాసానికి
కొన్ని చిటుకులు చిట్కాలు నేర్వాలె
క్షేమేంద్రుడు అని అంటూ వుండాలె.
రసము, ధ్వని, వక్రోక్తి అనే పదాలు

తూకానికి వేస్తూ వుండాలె
పాశ్చాత్య విమర్శకులను ఉల్లేఖిస్తుండాలె
అప్పుడే సమగ్ర సాహిత్య విమర్శ అని బల్లగుద్దాలె''

ఈ విధంగా ''ఆమె చెణుకులు'' ఇతివృత్త నవ్యత్వంతో, భావప్రకాశ వైచిత్రితో, లౌకిక జీవన చిత్రణతో, మానవ అనురక్తి విరక్తులతో ఏంబిస్తున్నది.

కవితల మలుపులు వంపులు వంపులుగా సాగిపోవటంలో కాని కని పించవు సొంపులు, వినిపించవు ఇంపులు. వంపులు ప్రధానం కనుకనే కావ్య శాస్త్రజ్ఞులు 'వక్రోక్తి'కి కావ్యంలో తగిన స్థానం ఇచ్చారు.

సెలయేరు సూటిగా ప్రవహిస్తుంటే రమ్యంగా గోచరించదు ; అది వంక రులు తిరిగి ప్రవహిస్తుంటూనే వంపుల లయ దానిలో నర్తన గతిలో వ్యక్తమవుతుంది.

గోపాలరెడ్డిగారి కవితా సంకలన సంపుటాలు పది. వీటిలో అయిదు "ఆమె'' పంచకం గ్రంథావళికి చెందినవి, మరొక ఐదు "కవితా" పంచక గ్రంథావళికి చెందినవి.

ఈ " సాగర సమీరాలు" పదవ సంకలనం. అంటే, అనువాద గ్రంథా లనుకాక ఈ కవి ఇప్పటికి పది కవితా సంపుటాలను రచించారన్నమాట; ''సాగర సమీరాలు'' లోని కొన్ని కవితా శీర్షికలు: "వృక్షాలు—వనాలు'' ''ప్రాసాదాలు''. ''జై జవాన్'', "జడ్జీ బంగళా", "కాబోయే పెండ్లి కూతురు", ''సుబ్బవ్వ అరుగు'', "సౌందర్యాన్వేషణ''; ''అందం ఎప్పుడూ అందమే'', ''ఉగాది కవిగోష్ఠి" మొదలైనవి.

ఇందులోవి అన్నీ చాలా దీర్ఘకవితలు. వీటిలో ఛోగట్టాభాగం ఎక్కువ వున్నట్లు తెలుస్తుంది. ఒక విషయాన్ని గురించి విపరంగా విపులంగా చెప్పటం కనిపిస్తుంది. ఈ కవితలన్నీ ఎక్కువగా ఇతివృత్తం ప్రాధాన్యం మీద ఆధారపడి వున్నవి. అంటే ఇవి ఎక్కువగా వస్తుగత (objective) వాస్తవాల వివరణలు; వీటిలో వ్యక్తిగత (subjective) అనుభూతి రెండవదిగా మాత్రమే వుంటుంది.

గోపాలరెడ్డిగారి కవితల్లో వస్తుగత దృక్పథం, వ్యక్తిగత దృక్పథం కూడా దర్శన మిస్తుంటవని ఇదివరకే చెప్పుకొన్నాం. ఈ పది కవితా సంపుటాల్లో కొన్నిటిలో అది ఎక్కువయితే మరి కొన్నిటిలో ఇది ఎక్కువ. ''సాగర సమీరాలు'' లో వస్తుగత దృక్పథం ఎక్కువగా వున్నట్లు తడుతుంది.

సృష్టిలో ప్రధానమైన సత్యాలు రెండు; అవే వస్తువు, వ్యక్తి. అందుకే వస్తుగత జగత్తూ, వ్యక్తిగత జగత్తూకూడ కవితకు సమానార్హమైన ఇతి వృత్తాలే.

"సాగర సమీరాలు" లోని మొదటి కవిత ''వృక్షాలు—వనాలు'' అనేది. ప్రపంచచరిత్రలో, అందులో ప్రత్యేకంగా భారతదేశంలో, ప్రఖ్యాత పురుషుల జీవితాలూ, ప్రత్యేక ఘటనలూ, మొదలైనవన్నీకూడ అరణ్యాలతో ముడిబడివున్నవే నంటారు ఈకవి. నిజమే మరి.

అరణ్యాలలో ఏదో ఆకర్షణశక్తి వున్నదనీ అందుకే రామాయణంలో అరణ్యకాండం, భారతంలో అరణ్యపర్వం. ఈ సందర్భంగా కవి అంటారు.

''రామాయణంలో కేంద్ర స్థానాలు
విశ్వామిత్రునితో అరణ్యాలు
కైకవరాల అరణ్యాలు
భరతుని అనునయాల చిత్రకూట అరణ్యాలు
మాయాహరిణాలు, సీతాపహరణాలు అడవులలోనే
అలాగే భారతకథ నిబిడ కానన ఛాయలలోనే
పాండవుల వనవాసం, ఉత్తర గోగ్రహణాలు
విజయుని తీర్థయాత్రా విహారాలు
యుద్ధానంతరం, ధృతరాష్ట్రుడు గాంధారి
మనశ్శాంతి కోరుతూ వెడలింది అడవులకే''

ఈ విధంగా ఇంకెన్నో ఉదాహరణలు వున్నవి ఈ కవితలో అరణ్యాల ప్రాముఖ్యాన్ని గురించి, వాటిలో వర్ధిల్లిన మహామహుల గురించి.

అరణ్యాలు ఎంత సుందరంగా వుంటవో అంత భయంకరంగా కూడ వుంటవి వివిధ క్రూరజంతుజాలముతో. కొన్ని వస్తువులు సుందరంగా

మాత్రమే వుంటవి: ఇంకొన్ని భయంకరంగా మాత్రమే వుంటవి; మరి కొన్ని సుందరంగానూ వుంటవి, భయంకరంగానూ వుంటవి. వీటిలో అరణ్యాలు ఒకటి. భయానికీ సౌందర్యానికీ సంధిస్థలం అరణ్యాలు: ఇందులోని ''ప్రాసాదాలు'' అనే కవితలో ఎత్తయిన ఆకాశ సౌధాలను గురించి వ్రాస్తు వాటిలోని నివాసుల గురించి అంటారు:

''వారికి భూమికి దగ్గర సంబంధము
లేన ట్లనిపించింది
.............
ఉదయించే సూర్యుణ్ణి ముందుగానే చూస్తారు
అ స్తమించే సూర్యుణ్ణి ఆలస్యంగానే చూస్తారు
ఎత్తైన చెట్లకన్నా మరింత ఎత్తుగ వుంటారు
కోకిల కూజితాలు వినబడవు
ఆమ్రమంజరుల సుగంధాలు వారిని చేరవు.''

సాధారణంగా పట్టణాల్లో వుండేవారికే ప్రకృతితో చాలావరకు సంబంధం తెగి వుంటుంది. ఇక ఆకాశ సౌధాల్లో వుండేవారి సంగతి సరేసరి, బొత్తిగా భూమితో సంబంధం లేకుండా వుంటారు. ఈ సత్యాన్నే గోపాలరెడ్డిగారు పైకవితలో వాస్తవ రూపంలో చిత్రించారు.

ఈ కవిలో ప్రపంచాన్ని గురించిన సూక్ష్మపరిశీలన (observation) వుంది. అది కవితా రచనకు ఎంతో అవసరం. పరిశీలనలేని కల్పన కేవలం ఊహాగానం మాత్రమే అవుతుంది.

ఈ పుస్తకాల్లో ''ఉగాది కవితాగోష్టి'' ''ప్రేమ్‌చంద్ శతజయంతి'' ''1857'' అనేశీర్షికలు కూడ వున్నవి. అంటే ఈ ''సాగర సమీరాలు'' వివిధ విషయాల కూడిక.

ప్రేమ్‌చంద్‌ను గురించిన కవితలో ప్రేమ్‌చంద్ రూపపటాన్ని కొన్ని మాటల్లో చిత్రించారు కవి.

''ఉన్నదానిని గ్రహించి తాతముత్తాతల వారసత్వమని
ఉన్నదానితో రాజీపడుట పిరికిపందలపని
పూర్వజన్మ కర్మఫలమని వాపోవుట
కాపురుషులకే యుక్తము

ప్రేమ్‌చంద్ అట్టి దుర్బలుడు కాడు
అశక్తుడు కాడు. కాలగమనాన్ని ధిక్కరించి
మానవ సమాజాన్ని సంస్కరించి
దుఃఖభాజనుల హృదయాలలో
ఆనంద రసాన్ని చల్లాలని యత్నించాడు
సాహిత్య వేదికే ఆయన సమరభూమి,
కలమే ఆయన కరవాలము.

.... .... .... .... .... .... .... ....

స్థూలరేఖల్లో రచించిన వాస్తవ రూప చిత్రం ఇది; ఇందులో సజీవంగా శ్వాస పీలుస్తున్నాడు. ప్రేమ్‌చంద్!

ఈ కవితా సంకలనంలో ఎక్కువగా వ్యక్తుల దిగజారిన జీవితాలచిత్రణ ప్రత్యక్షమవుతుంది. వీరంతా బ్రతికి చెడినవారే, చెడి బ్రతికినవారు కాదు. ఇందులో ''అవమానితుని విజయం'' అనే కవితలో తోబుట్టువులైన అక్కలను గురించి తమషాగా చెపుతారు కవి.

"అక్కయ్యల కథవేరు.
మనతో పుట్టిపెరిగి మరో గ్రామానికి
కుటుంబానికి పోతారు.
మన మర్రిచెట్టు ఎక్కడో ఊడలు వేసినట్లుంటుంది.
మన ఊరిమబ్బు ఎక్కడో వాన కురిసినట్లుంటుంది.

.... .... .... .... .... .... .... ....

ఏడుపుకాలనులో నవ్వులకలువను పొందానని తలచాను.
శిథిల ప్రతిష్ఠపై భగ్నస్వాభిమాన దుర్గముపై
విజయ కేతువును నాటానని గర్వించాను.
చీకటిబాటలో వెలుగు ప్రమిదెను వెలిగించానని తలచాను.''

పై పంక్తులు స్వర్ణరేఖలు; తొలకరి మెరుపుల తళుకులు; ఉన్నతమైన సుకుమార భావపుండరీకాలు; కవితలు అనేక విధాలుగా వుంటవి. ప్రతి విధమూ సుందరంగా ఉండదు. కొన్ని విధాల మాత్రమే సుందరంగా ఉంటవి. గోపాలరెడ్డిగారి కవితా విధానం భావ లావణ్యానికి రసమయ ప్రతిధ్వని!



# వృక్షాలు - వనాలు

బ్రహ్మాండాన్ని సృజించి ప్రకృతే
స్నిగ్ధ స్మితములను చల్లింది.
ఆనందవిహ్వాలతో చకితమయ్యింది.
హర్షపులకలే వృక్షాలుగ మారాయి.
అంతరంగ ఆనందాన్నే బహిర్గతపరచింది.
దుర్దమమగు సంతోషాన్ని వెదజిమ్మె
కవితాఝురులే వృక్షాలు వనాలు,
భూఫలకము మీద ప్రకృతి
చిత్రించే భావగీతికలు.
ఎన్నోఛందస్సులలో, ఎన్నోస్వరాలతో
రచింపబడిన శ్లోకాలే, గేయాలే.
సప్తస్వరాలలో డెబ్బయి రెండు మేళకర్తలు పుట్టాయి
ఆరోహణ అవరోహణ స్వరభేదాలతో
లోపించుటతో అశేష జన్యరాగాలు స్రవించాయి
ఏబదిఆరు అక్షరాలలో వేలపదాలు వచ్చాయి
గణమాత్రా పరివర్తనలతో భిన్నఛందస్సులలో
అపారసాహిత్యము ఉత్పన్నమయ్యింది,
భిన్న భిన్న రూపాలలో
భావగీత భూరుహాలు ప్రత్యక్షమయ్యాయి.
తృణదళముల నుండి వనస్పతులవరకు

అందముగ పచ్చగ గోచరించాయి.
ఎన్నిసహస్రవిభేదాలో ఈ తరు సంపద.
అల్లేవి, పొట్టిగ ఎదిగేవి, పొడవుగ పెరిగేవి
ఊడలువేసేవి, తాకితే ముడుచుకొనేవి
పువ్వులు పూసేవి, పువ్వులు పూయనివి
పండ్లనిచ్చేవి, పండ్ల నియ్యనివి.
భిన్నరూపాలు, విచిత్ర వైఖరులు
అలంకారపు వృక్షాలు, సుగంధాల నిచ్చేవి
నిత్యపుష్పితాలు, నియమిత ఋతువులలో పుష్పించేవి
ఆరీతినే పండ్లనిచ్చేవి.
ఔషధులు, చూర్ణాలు, కషాయాల నిచ్చేవి
వంటచెరుకు నిచ్చేవి, ముళ్లతో కూడినవి.

మనము భుజించే ఆహారము
ఈ తరు సంపదకు చెందిందే
కుటీరాలు నివాసాలు అంతే
ధరించే వస్త్రాలు వాని దగ్గర చుట్టాలే.
ఋషులు తపస్సుచేసేది తపోవనములలోనే
బ్రహ్మచారులు శిక్షణపొందేది
ఆశ్రమ గురుకులములలోనే
జీవితములో మూడవదశ వానప్రస్థమన్నారు.
చెట్లు లేని ప్రదేశాలు
ఉన్నత శీత పర్వతశిఖరాలో
ఎడారుల సికత వైశాల్యాలో
జలమయములైన సముద్ర అగాధాలో.

అరణ్యాలలో ఏదో ఆకర్షణశక్తి యున్నది

రామాయణములో అరణ్యకాండము
భారతములో అరణ్యపర్వము
కేవలము యాదృచ్ఛికములు కావు
ఏదో నెపముతో పెద్దలందరు
అడవులకు పోవలసిందే.

రామాయణములో అరణ్యాలే కేంద్రస్థానాలు
విశ్వామిత్రునితో అరణ్యాలు
కైకవరాల అరణ్యాలు
భరతుని అనునయాల చిత్రకూట అరణ్యాలు
మాయాహరిణాలు, సీతాపహరణాలు అడవులలోనే
అలాగే భారతకథ నిబిడకాననచ్ఛాయలలోనే
పాండవుల వనవాసం, ఉత్తర గోగ్రహణాలు
విజయుని తీర్థయాత్రా విహారాలు
యుద్ధానంతరం, ధృతరాష్ట్రుడు గాంధారి
మనశ్శాంతినికోరుతు వెడలింది అడవులకే
తరుచ్ఛాయల అంకములో దుఃఖజలాల కార్చుటకే
కృష్ణుడు అవతారము చాలించింది
వనలతా నికుంజములలోనే
హరిశ్చంద్రుడు అడవులలో తిరిగాడు
నలుడు దుకూలాల పోగొట్టుకొన్నాడు
కర్కోటకుని కృపతో మాయారూపకముతాల్చాడు.

అడవులు కాళిదాసుని కూడ
తమ సౌందర్యజాలములోనికి ఈడ్చాయి.
శకుంతల నాటకము

మృగయా వినోదాల నిషేధాను నయములతోనే
ప్రారంభ మయింది
శకుంతల జీవితమంతా వనవాసాల్లోనే
తపస్సులకు, చదువులకు
వేటల కుతూహలాలకు
శోకాగ్నుల చల్లార్చుటకు అరణ్యాలు
శాఖా బాహువుల చాపి ఆహ్వానించాయి.
పర్ణములు మౌన వాక్కులతో సత్కరించాయి.

లిఖిత సాహిత్యము భూర్జపత్రములమీదో
తాళపత్రములమీదో దొరకింది
ఆధునిక విద్యావిజ్ఞాన ప్రచారమంతా
కాగితాల మీదనే సాగిస్తున్నది.
ఆర్థికగతి విస్తరణమంతా నోట్లచెలామణిమీదనే.
కాగితాలకు కావాలె వెదురుపొదలు, వృక్షశకలాలు
బండ్ల నుండి పడవల వరకు
ఉయ్యేల మొదలు శ్మశానము వరకు
వృక్షాలు అవసరమయ్యాయి.
రకరకాల మృగములకు పక్షులకు
సరీసృపాలకు అరణ్యాలే ఆశ్రయమిచ్చాయి.

ప్రకృతి లీలాసాగరములో ఊగే
తరంగాలే వృక్షాలు
మానవుల ఆహార ఆవాసములకు
మూలాధారము వృక్షాలు.
ఆనందాన్ని శాంతిని చల్లే

ప్రియవచనాలే వృక్షాలు
వృక్షరహితమైన ప్రకృతి
నిత్యనగ్నయై అపార మరుభూమిగతోస్తుంది
ప్రళయపీఠికగ, మబ్బుల పిలువనేరని ఎడారులుగ
నిస్సారముగ, కర్కశహృదయముగ తోస్తుంది
అశేష ఆనందసంపదే మన తరుసంపద
వర్షాల ఆహ్వానిచ్చేది ఈ తరురాజే.
చల్లగ, నీడల చెలిమిని చల్లేవి వృక్షాలే.

(20.12.80, నెల్లూరు.)

# కోనసీమ

చాలా ఏడుల పిదప అమలాపురం వెళ్లాను.
వంతెనల నిర్మాణము వెనుకపోవుట ఇదే ప్రథమము
పడవలలోదాటి బొబ్బరలంక చేరుటలేదు.
సరాసరిగ రాజమండ్రి నుండే క్రొత్తపేటమీదుగ
అమలాపురం చేరాము.
పైరుపొలాలలో ఉన్న అదనులోనే వెళ్లాము.
కోనసీమను సస్యశ్యామలతను
కండ్లారచూచి ఆనందించాను.
ఆంధ్రుల మరకతమణి కోనసీమ

గోదావరి మాతృవాత్సల్యముతో
గౌతమి వశిష్ఠ నదీబాహువుల ప్రసారించి
కోనసీమ బుజ్జగిస్తూ పోతుంది
సారవంతమైన మూడుతాలూకాల
లక్షల సంతానాన్ని ఆనందపరుస్తుపోతుంది.
రెండువైపులనదులు, ఎదురుగ
సముద్ర ఆననబింబము కనపడుతుంటాయి.
మనోహరసీమ, సుజలాం సుఫలాం
సస్యశ్యామలాం అనదగిన సీమ.
గిరులులేని కేరళవలె రమ్యమైన సీమ
కనుచూపుమేరకు పచ్చగ పొలాలతో
తోటలతో కన్నులపండువుగా ఉండేసీమ.

కొబ్బెర తోటలు నిండిఉన్నాయి.
సన్నగ ఎదిగి విచలిత అలకలతో
నిండిన ముఖములతో ఊగుచుంటాయి కొబ్బరిచెట్లు
దిగంతములవరకు స్నిగ్ధహ్రస్వశిరోజాలతో
సాంద్రతరుచ్ఛాయలతో శోభిస్తుంటాయి కొబ్బరిచెట్లు
మంగళకరమైన దీప్తి కాన్పిస్తుంటుంది ఆగ్రామాలలో
మధ్యమధ్య కదళీవనాలు పనసవృక్షాలు కాన్పిస్తుంటాయి
పైరుఎదిగే పొలాలు సన్నని హస్తాలనెత్తి
హరితహర్షపతాకలవలె కాన్పిస్తాయి.
పంటపండి శిరోభారముతో వంగిన
పొలాలు నమాజ్‌చేసే భక్తసముదాయమువలె ఉంటాయి
అరటిచెట్లు పొడవైన ఆకులతో
కొబ్బరిచెట్ల ఆకులతో సరససల్లాపాలు ఆడుచునుంటాయి
నర్మభాషణలనలుపుచునుంటాయి.
అరటిచెట్టు కొబ్బరిచెట్టు పడుచుదంపతులై
వెన్నెలవిహారము చేస్తుండినట్లుంటుంది.
ఎడతెగని అనురాగముతో
కళ్యాణకరమగు గృహస్థాశ్రమ మర్యాదను
పోషిస్తుంటాయి.
నిబిడఛాయలతో కొన్నిచోట్ల
భూమి అసూర్యంపశ్యగా ఉంటుంది
చల్లనిగాలుల గుసగుసల
పొడవైన ఆకుల కొబ్బరి అరటిచెట్లు
ఒడలంతా చెవులుచేసి వింటున్నట్లుంటాయి
అలౌకిక సంగీతాన్నే వింటున్నట్లుంటాయి.
నిత్యపరవశత్వాన్ని పొందినట్లేఉంటాయి

బల్లకట్టుల మీద దాటే ప్రయాణికులు
నెత్తిబరువుల దింపుకొని విశ్రాంతిపొందినట్లుంటారు.
అచ్చటచ్చట కాన్పించే కొంగలబారులు
చెట్లచిరునవ్వులవలె కాన్పిస్తాయి.
కోనసీమ వేదపఠనకు ప్రసిద్ధి
ఉచ్చారణ ఉదాత్త అనుదాత్త స్వరాలు
జటల పునశ్చరణాలు దేశములోనే ప్రసిద్ధాలు
అగ్రహారాలు విప్రకుటుంబాలు
వేదాలకు స్వస్థానముగ కన్పిస్తాయి
శతాబ్దాలనుండి ఆ జ్ఞానశిఖను
తరతరాలవారికి వారసత్వముగ అందిస్తున్నారు.
వంశమర్యాదకు లక్షణముగ భావిస్తున్నారు.
వేదపఠన శాస్త్రాధ్యయనము
అగ్రహారాల్లో ముఖరితమగుతుంది
ద్వీపముగ ఉండిన కోనసీమ
వంతెనలతో ఇతర ప్రాంతాలలో చేరింది
ప్రాచీన ప్రతిష్ఠను నిలుపుకొంటుందో
నలుగురితో సమానమగుతుందో
ముందు ముందు చూడాలె.
ప్రాచీనతను నిలుపుకొన్నా
నవీనతను అవలంభించినా
ప్రకృతిశోభ ఆంధ్రహృదయస్థ
మరకతమణిగానే ఉంటుందని ఆశిస్తున్నాను.
దర్శన యోగ్యము కోనసీమ
ఆంధ్రులు గర్వింపదగినసీమే కోనసీమ.
(24.12.80, నెల్లూరు.)

# ప్రాసాదాలు

పురవర్ణనలు అందులో ప్రాసాదాల వర్ణనలు
కావ్యాలలో ముఖ్యాంగాలు.
వాల్మీకి మొదలు చేమకూరకవి వరకు
మేడల ఎన్నివిధాల వర్ణించారు.
లంకాపురి ప్రాసాదాల మణిమరకత వజ్రాలతో
ఆకసమే మెరిసిందని
గవాక్షాలగుండ సాగిపొయ్యే మేఘాలు
ఆరవేసిన బట్టల తడుపుతున్నాయని
దిగివచ్చే అభిసారికలు
మేఘ మండలముపై కాలిడి
చంద్రమండలము వరకు విహరించినారని
చంద్రుని వంటయింటి కుందేలని
తమ తమ కల్పనా చమత్కారాలను
ఊహాబలాన్ని చూపించారు.
ఆకాశపు శూన్యతను గ్రహింప నాలుకలు చాపుచున్నవని
ఆకాశాన్ని ముద్దిడుచున్నాయని వర్ణించారు.
అతిశయోక్తి అలంకారాల ఉపయోగించారు.
ఆనాటి కల్పనలే రూపకల్పనలు చేసికొని
కనిపిస్తున్నాయా
కవితా స్వప్నాలు సాక్షాత్కారాన్ని
పొందుతున్నాయా అని భావిస్తున్నాను

బొంబాయిలో పెక్కు అంతస్తుల మేడలు చూస్తుంటే
అమెరికాలో ఇంకా ఎత్తైన మేడలున్నాయని విన్నాము
మనదేశములో ఎత్తైన మేడలకు
రాజధాని బొంబాయి నగరమే.
ఇటీవల కవితా దృష్టితో సూక్ష్మముగ పరిశీలించాను
నేను ఒకమేడలో పరుండి
ఎదురుగా పెద్దమేడను చూస్తూ వచ్చాను
చివర అంతస్తులవారిని గూర్చి ఆలోచించాను.

వారికి భూమికి దగ్గర సంబంధము
లేనట్లనిపించింది
క్రిందనడిచే మనుష్యులు బండ్లు
సూక్ష్మముగ కాన్పిస్తున్నారు.
గొంతు వినబడదు, గుర్తు పట్టలేకుంటారు
బండ్ల చప్పుడులు వినరావు
ఉదయించే సూర్యుణ్ణి ముందుగానే చూస్తారు
అస్తమించే సూర్యుణ్ణి ఆలశ్యంగానే చూస్తారు
ఎత్తైన చెట్లకన్న మరింత ఎత్తుగ ఉంటారు
కోకిల కూజితాలు వినబడవు
ఆమ్రమంజరుల సుగంధాలు వారిని చేరవు
నవవర్షములలో భువినుండి
ఉబికే మట్టివాసనలు సోకవు
పావురాళ్లు కాకులు క్రిందనే ఎగురుచుంటాయి
భూమితో సంపర్కము లేక
త్రిశంకు స్వర్గాన్ని చేరినట్లుంటారు
వసంతము వచ్చిందో రాలేదో

తెలియనట్లే ఉంటారు.
అలలతో ఊగేసాగరము
కదలికను మరచి తూగే పెద్దకొలనువలెచూస్తారు.
మరో ప్రపంచమే, గగనప్రపంచమే అది
అవతరించే ప్రకృతి లక్ష్మని
ముందుపోయి స్వాగతం చెప్తారు.
విజ్ఞానయుగ ఆగమనానికి
తోరణాలు కట్టినట్లుంటాయి
దగ్గర రావద్దని విమానాలను హెచ్చరిస్తూ
ఎర్రజండా దీపాలను శిరాలతాల్చి ఉంటాయి
మెరుపులు ఉరుములు దగ్గర చుట్టాలవలె ఉంటాయి.

సినిమా నారదులవలె లిఫ్టులో దిగుతారు
గంధర్వులవలె పైకి పోతుంటారు.
ఉదయము పనులకు పోయ్యేవారు
బడులకు కచ్చేరీలకు వెడలువారు
గబగబ దిగి వస్తారు
భూమాత మమతను తిరిగి పొందవచ్చే
సంతానముగ వస్తారు
అన్ని మతాలవారు వివిధ భాషలవారు
భిన్న భిన్న వేషాలతో దిగివస్తారు
ధోవతుల కట్టేవారు లేరనే చెప్పొచ్చు
ధోవతుల అలవాటు నగరాలలో క్షీణిస్తున్నది.
బాలికల వేషాలు చిత్రవిచిత్రముగా ఉంటాయి
జీన్సు పాంట్లు ఫ్రాకులు ముస్లిమ్‌షరాయిలు
చూడీదారాలు పంజాబీవేషాలు

రంగు రంగులతో కన్పిస్తాయి
చీరలుకూడ కన్పిస్తుంటాయి
రాత్రి ఒక చెట్టునందే విశ్రమించి
ఉదయాన్నే నలుదిక్కుల పర్వే
పక్షులవలె ఉంటారు
సాయంత్రము అలసిన రెక్కలతో
నెమ్మది నెమ్మదిగా తిరిగివచ్చి
గూడుల చేరుకొంటారు
ఇంతమంది ఈ ఒక్క మేడలో
నివసిస్తున్నారా అనిపిస్తుంది

మేడకట్టిన భూమి మీద
అందరినీ నిలబెట్టితే ఒక్కొక్కరికి
బెత్తెడో జానెడో భూమి లభిస్తుంది
పట్టణాలలో భూమి ధర ఎక్కువయ్యేకొద్దీ
ఆకాశమువైపు పోకుంటే గిట్టుబాటుకాదు
కొద్దిస్థలములో పెక్కు అంతస్తులు
వందలమంది కాపురము
అక్కడనే టెలిఫోన్లు, రేడియోలు, దూరదర్శనాలు
రెఫ్రిజిరేటర్లు, గ్యాసుపొయ్యిలు.
ప్రత్యేకమైన గదులలో ఒకే మేడలో కాపురం
అన్నిమతాలు భాషలు వయస్సులు
వేషాలు సహజీవనము
రోగులు వయస్సుమళ్లినవారు
పనిలేని ఆడవారు వారాలు వారాలు
భూమిస్పర్శే లేకుంటారు.

ఎంత వ్యత్యాసము గ్రామీణ జీవనానికి
28 అంతస్తుల మేడల జీవనానికి
ఇచ్చట విజ్ఞానయుగ సంపన్నతా వైభవము
రూపొందినాయి.

రానున్న దశాబ్దాల అరుణోదయము
భాసిస్తుంటుంది.
స్వరసమ్మేళనాల పాటకచేరీగ దీపిస్తుంది.
సాయంత్రము గదులలో ఒకటొకటిగ
దీపాలు వెలుగుతాయి.

తొమ్మిది పది గంటల మధ్య దీపాలు ఆరిపోతాయి
తిరిగి వేకువనే నెమ్మది నెమ్మదిగ వెలుగుతాయి
నీలసరోవరములో కమలాలు వికసించినట్లు
మొద్దుకొన్నట్లు ఉండేది.

తన గంభీరమైన ఔన్నత్యముతో
నగరరక్షకుడుగ కనబడేది చీకట్లో.
మరి గ్రామాలవారో
తాత ముత్తాతల దినాళ్ళు మార్పుచెందక
నిలిచి ఉంటాయి, పాతపద్ధతులు గూడు కట్టుక ఉంటాయి
ఒకటి 21 వ శతాబ్దానికి లాగుతుంటే
మరొకటి !9 వ శతాబ్దానికి లాగుతుంది
ఒకటి విజ్ఞానము వైపు
మరొకటి మతమువైపు పిలుస్తుంటాయి
మనము యుగసంధిలో సతమతమగుచున్నాము
శాంతి దూరమైనా, స్వార్థము ఎక్కువైనా
మొగ్గు విజ్ఞానముదే

దాని ప్రతీకే ఈ 28 అంతస్తుల మేడ
సూక్ష్మ రూపములో ఇమిడిన
ఐక్యభారతభూమే ఈ మేడ.

(3-2-81 నెల్లూరు)

# జై జవాన్

మహనీయులు మహనీయ స్వప్నాలనే కంటారు
మహనీయ నిశ్చయాలే చేస్తారు
మహావీరులు వీరోచిత స్వప్నాలే కంటారు
పెద్దకార్యాలనే చేపట్టుతారు
పెద్ద విజయాలనే సాధిస్తారు
వారి స్వప్నాలు చిన్న తెరలపై ఇమడవు
పెద్ద తెరలపైనే వారి కలలు చిత్రిస్తారు
సింహాలు కుందేళ్లను వెంటాడవు
పెద్ద దేశాలు పెద్ద బలాన్నే సమకూర్చుకొంటాయి
పెద్ద విజయాలకై పెద్ద యుద్ధాలే చేస్తాయి
పెద్ద త్యాగాలే చేస్తాయి
భావనలు, నిశ్చయాలు, యత్నాలు, త్యాగాలు
పెద్ద ఎత్తునే ఉంటాయి
ప్రపంచశాంతికే ప్రపంచయుద్ధాలనే చేస్తారు
లక్షలమందిని బలిఇస్తారు
లక్షలమందిని బలితీస్తారు
అధికతరమైన ఆయుధబలాన్ని చేకూరుస్తారు
ఆయుధ ఆధిక్యమే సమరనివారణమని తలుస్తారు
ఆధిక్యముచే ఆయుధ ప్రయోగాలు
అనవసరమని యోచిస్తారు

బలశాలికి బలమే పెట్టుబడి
నిరుపయోగమున బలాన్ని వమ్ముచేయడు
బలమున్నదన్నదే శత్రువులకువెరపు.

వీరుడు నిద్రలోసహితము పెద్ద దృశ్యాలనే చూస్తాడు
పెద్దయుద్ధాలలో పాల్గొని పెద్ద గెలుపులనే గెలుస్తాడు
దేశప్రతిష్ఠ కొరకు తోడిప్రజల కళ్యాణముకొరకు
పెద్ద నిర్ణయాలనే చేస్తాడు
నేడు ప్రాణము ఒడ్డి, రేపుల శ్రేయస్సుకై
కృతనిశ్చయుడగుతాడు

కాతరత భీరుత్వము అతని గుండెను తాకవు
పలాయనభావము మనస్సునకు తట్టదు
క్రిందపడి కూడా, కత్తిని శత్రువువైపు ఆడిస్తాడు
విరోధి వక్షముపై కూర్చున్నట్లుగ భావిస్తాడు
తన రక్తాన్ని చూస్తూ, విరోధి రక్తమని
తలచే మగసిరి అతనిది
వెనుకకు తగ్గినా పైకి దుముకుటకే అని భావిస్తాడు
నేడు బ్రతికియుండుట
రేపు విజయపతాకను ప్రతిష్ఠించుటకే అని నమ్ముతాడు
తన రుధిరసిక్త భూతలము మీదనే
రేపటి భాగ్యోదయమగుతుందని
సమకాలీనులకు వారికి పుట్టబొయ్యే సంతానానికి
శుభమగునని విశ్వాసము.
తాను చచ్చినా, దేశమర్యాద నిలుస్తుందని
స్వప్నాలు కంటాడు

పెద్ద దేశానికి చెందిన పెద్దసైనికుడనని
భవిష్యత్తు భారము తన మీదనే నిర్భరమని
విశ్వసించి పోరాటము సల్పుతాడు
మహాసమరములో తాను అల్పుడని
తనపాలు అల్పమని అనుకోడు
పెద్దదేశాన్నే చూస్తాడు
పెద్ద ప్రతిష్ఠా రక్షణనే వీక్షిస్తాడు
సమర వృక్షము విజయఫలాల నిస్తుందని
శాంతి బీజాలను నాటతుందని అకుంఠిత విశ్వాసము
అవసరమైతే ఆ వృక్షానికి తనరక్తమే
నీరుకాగలదని, మాంసము సత్తువ కాగలదని
అంచంచల విశ్వాసము
తన చితానల జ్వాలలే
దేశమంగళ కర్పూర నీరాజన శిఖలు
కాగలవని సందేహమెరుగని నమ్మకము.

తల్లి భార్య సంతానము జ్ఞప్తికిరారు.
ఆ తరుణాన వారిజ్ఞాపకము
భీరుత్వానికి లక్షణమని
అనురాగభావాలు కాతర కాపురుషుని
కాలి బంధాలగుతాయని
రణభీరుని పలాయన సోపాలగుతాయని
సమరాంగణములో ప్రేమ భావాలు
తిరోముఖ పాశాలగుతాయని గట్టిదైన నమ్మకము
అతనిది పురోదృష్టే అగ్రసర మనోరథాలే
విజయ స్వప్నాలే.

చిన్న సైనికుడే పెద్దదేశ మర్యాద పరిరక్షకుడే
చిన్నకాయములో పెద్ద సంప్రదాయాల
మూల్యాల చిహ్నాముగా చేయిపైకెత్తుచు నుంటాడు
అల్పత్వములో మహత్తును చూపేవాడే
మహనీయుడే మహిమాన్వితుడే
మహనీయ స్వప్నాల చూస్తూ
చిరశాంతి అంకములో శయనిస్తాడు
జైజవాన్ అంటు అశ్రుతర్పణ కావించాము.

6—2—81 నెల్లూరు.

# జడ్జీబంగళా

ఊరికి మూలగ, ఇంటి ఎదురుగ బంగ్లా ఉండేది
పాతబంగ్లా, కంపెనీవారో, అంతకుముందేకట్టింది
లావుగోడలు, పెద్దగదులు ఎత్తైనకప్పు.
కొన్నిగదులలో కప్పు ఉరుస్తుందేది
గోడలు ముసలితనాన్ని చూపిస్తుండేవి
నాకుతెలిసిన నాటినుండి జిల్లాజడ్జీ ఆ బంగళాలో కాపురం
ఆంగ్లేయులు, ఐ. సి. యస్ జడ్జీలు
ఉద్యోగములోపై కివచ్చినజడ్జీలుముస్లింలూ, హిందువులు
క్రైస్తవులు ఆ బంగళా నివాసులు
ప్రాచీన సామ్రాజ్యవాదులు, గుప్తదేశాభిమానులు
జిల్లా న్యాయపరిపాలన చేస్తూ వచ్చారు
కార్లులేని దినాలు కార్లదినాలు
ఆ బంగళా ప్రాంగణాలు చూచాయి
పెట్రోల్ కొరత దినాల్లో సైకిల్మీదవెళ్లే
ఆంగ్లజడ్జీని పరికించాయి
పర్దా స్త్రీలను అవలోకించాయి
టెన్నీస్ ఆడే స్త్రీలను చూచాయి
వివిధ స్వభావాల జడ్జీలను చూచాయి
వకీళ్లను సరిగావినేవారు, విననివారు
ఓరిమిగలవారు, లేనివారు ఉండేవారు

నేరముచేసినట్లు కొద్ది అనుమానము కలిగినా
శిక్షించే జడ్జీలున్నారు
సాక్ష్యములో లోపాలున్నవని మన్నించే జడ్జీలున్నారు
మరణశిక్ష సులువుగ ఇచ్చేవారు ఇవ్వనివారు
పలురకాల ప్రవృత్తులతో వ్యవహరించేవారు
అందరూ న్యాయాన్ని సంరక్షించాలని చూచేవారే
ఏదిన్యాయం అనే దానిలోనే వివిధ దృక్పథాలు
నేరము రుజువయ్యిందా, ఎంతశిక్ష
యావజ్జీవన కఠినశిక్షా మరణదండనా
అని యుక్తాయుక్తముల విచక్షించేవారు
వాస్తవికత ఒకవైపు న్యాయము ఒకవైపు తూగేవి
సాక్ష్యాల లోతుపాతులు విచారించాలె
వకీళ్లుచేసే వాదోపవాదాలు పరిశీలించాలె
సమపరిస్థితులలో పైకోర్టుల తీర్పుల చూడాలె
అన్నీ ఆలోచించి ఉచితమైన రీతినే తీర్పువ్రాసి
కోర్టులో అందరి ఎదుట చదవాలె
మనఃపూర్తిగ విశ్వసించిన దానినే తీర్పులో వ్రాయాలె
న్యాయవీరుడుగ నిలిచి సమస్యా సందేహాలను
ఎదుర్కొవాలె.

దయాదాక్షిణ్యాలకు తావులేదు
కారుణ్యభావానికి చోటులేదు
సత్యనిష్ఠురుడై, న్యాయదృష్టితో ఉచితజ్ఞతతో
ధర్మపాలనచేయాలె
న్యాయముకడ అందరు సమానులనే
ధర్మోక్తిని కార్యాన్వితముచేయాలె
పరిచయులు అపరిచయులనే

తారతమ్యాలు పాటింపరాదు
అనేకవలయాలను దాటుకొని
సత్య కేంద్రాన్ని చేరాలె
నిష్కర్షగ నిర్మొగమాటముగ
నిశ్చితాభిప్రాయాన్ని తీర్పులో చాటాలె
దానికి వలసిన కారణాలను స్పష్టముగ తెలుపాలె
తన నిశ్చయాన్ని హైకోర్టు బలపరచడానికి
వలసిన వివరాలను విశదపరచాలె
ఎన్నోసంవత్సరాలుగ అట్టి మనస్సంఘర్షణల
ఈ బంగళా చూచింది
కోర్టు న్యాయ స్థానమైతే
బంగళా న్యాయాన్ని ఆచరించే ధామముగ ఉండేది
సాక్షులతో వకీళ్లతో వ్యవహారము జరిగేది కోర్టులో
ఏకాంతములో ఆలోచించి, సందేహ నివృత్తుల చేసికొని
ఉచిత నిర్ణయానికివచ్చి, తీర్పువ్రాసేది బంగళాలో
వినేది కోర్టులో ఆలోచించేది బంగళాలో
బంగళా గోడలు ఎన్ని ఆలోచనాఝుంఝూ
మారుతాలను ఎదుర్కొన్నవో
ఎన్ని నిష్ఠుర నిర్ణయాలను చూచాయో.

శిక్షకు సిద్ధపడిన ముద్దాయిలు
విడుదల తీర్పును విని ఎంత ఆనందించేవారో
బంధువులు ఎంత ఆహ్లాదంగ చేరేవారో
వకీళ్లకు సాక్షులకు ఎంత కృతజ్ఞత తెలిపేవారో
విడుదల తీర్పును ఆశించిన ముద్దాయిలు
మరణశిక్షనో యావజ్జీవ కారాగారపు తీర్పునో

విన్నపుడు, ఎట్టి విషాద దృశ్యాలు
కోర్టులో కన్పించేవో మ్లానముఖాలతో
అశ్రుపాతాలతో భార్యాబిడ్డల వీడ్కోలు
ఎంత గుండెబరువుతో జైలునకు నడిచేవారో
ఆ నిర్ణయాలను వినిపించేది కోర్టులో
పుట్టిపెరిగించి బంగళాలో
జడ్జి గంభీరంగ, స్మితములేని ముఖముతో
ముద్దాయిలవైపు చూడకుండ
మృదువచనములతో కఠినమగు శిక్షను చెప్పేవాడు
బ్రతుకు చావుల సందిగ్ధకాల మది
విడుదలలు శిక్షలు ఊగుచున్న సమయ మది.

కొందరు జడ్జీలు
మరణశిక్ష ముగ్గురికి విధించానని
గుండెబరువును తేలిక చేసికొనుటకు
భార్యతో చెప్పినపుడు 'హరి హరి' అంటు
పూజాగృహములోనికి వెళ్లి, భార్య
ప్రత్యేక ప్రార్థనల చేసేది
విద్యుక్త ధర్మమును పాటిస్తు
కర్తవ్య నిర్వహణకై, న్యాయపాలనకై
మరణశిక్ష విధించాడని, మన్నించి రక్షింపని
దేవుడుని వేడుకొనేది.
అంత ఘోరమైన హత్యచేసిన వానికి
మరణశిక్షే ఉచితమని సంతసించే
భార్యలు ఉన్నారు.
భిన్నగుణముల జడ్జీలు

భిన్న పరివృత్తుల భార్యలు
ఉండేవారు ఈ బంగళాలో.

జరాభారముతో శిథిలావస్థలోనున్న
బంగళాను ఆవరణను అమ్మేశారు
కొన్నవారు పెద్దయత్నముతోనే
దానిని పడగొట్టాలిసి వచ్చింది
గోడలు మలబడేవి గడ్డబారల దెబ్బలకు
చిన్నతనము నుండి చూస్తుండిన
పాతభవనాన్ని కూలతోసి కుప్పచేశారు
అనేక కఠిన నిర్ణయాలకు ఆస్పదమైన
బంగళా కూలింది, రాళ్లతీసి పారబోశారు
కలపను పెద్దధరకే అమ్మారు
వృద్ధ రుషి మరణించినట్లే ఉండింది.
ఆ భవనాన్ని కూలవేస్తుంటే
అనేక వసంతాల చూచిన వటవృక్షమే
నరకబడినట్లుంది.

11-2-81. నెల్లూరు.

# కాబోయే పెండ్లికూతురు

పెండ్లికూతురు వివాహమండపాన వచ్చికూర్చున్నది
నాలుగేళ్ల అమ్మాయి ప్రక్కనే కూర్చున్నది
అదేవేషము కేశాలంకరణ
బుజ్జిపెండ్లి కూతురువలె ఉండింది
మృగశాబకము రీతి ఉండింది
చంద్రుని ప్రక్క శుక్రతారవలె ఉండింది
తల్లిదండ్రుల కన్నుల పండువుగా ఉండింది
మంచి వర్చస్సుతో అందాల రాశిగా ఉండింది
గడచిన కాలాల నీడచిన్నది
రానున్న కాలాల నీడ పెద్దది
తెలియని వయస్సులో బొమ్మలాటగ ఉండింది
మొగ్గవలె ఉండింది, పిందెవలె ఉండింది.

భవిష్యత్తు ఆహ్వానిస్తున్నది
అజ్ఞాత మధురిమల వంశీనాదము
స్వరాల సంకేతముతో పిలుస్తున్నది
అంతా భవిష్యత్తే, దానిసోపానాలే ముందుకన్పిస్తున్నాయి
మందగమనముతో క్రమేణ వానిని ఎక్కాలె.
అప్రయత్నముగనే, అజ్ఞాతముగనే
ప్రాయపు గాలులు ఆమెను పైకి ఎత్తుతాయి.
కొన్ని వసంత పవనాలు, నిదాఘ తపనాలు

మేఘసౌదామినీ కటాక్షాలు
శరత్ నిర్మల జ్యోత్స్నా దీప్తులు
హేమంత శిశిర తుషారపాతాలు
శీతల ఉత్తరవాయువులు
ఆమె చుట్టుచేరి కోలాటాలు జరుపుతాయి
ఆ ఉత్సవాల దశాబ్దిలో, యుగళదశాబ్దిలో
దేహమనములు బహుళపరివర్తనములకు
లోబడుతాయి
ఒడలి ఒడ్డున ఎల ప్రాయపు అలలు ఆటలాడుతాయి
మనస్సు ఆకాశములో తియ్యని కోర్కెలు
ఉత్సుక స్వప్నాలు పనిలేక విహారము సల్పుతాయి
తెలియరాని ఆవేశము ఉల్లాసము
ఆవహించి నట్లుంటాయి
మొగ్గ అరవిచ్చిన కన్నుల తెరుస్తుంది
పిందె పెరిగి దోరకాయ అగుతుంది

శైశవ యౌవనాలు కురంగాలవలె
గంతులిడే కాలమది
నెమలి తొలి నృత్యానికి గజ్జెకట్టే సమయమది
అస్పష్టమైన భవిష్యత్తు మురళీ రవళి అది
నిశ్చయ నిర్ణయాలు లేని సందిగ్ధ కాలమది
లోతులు తెలియని సాగర నౌకాయాత్రా కాలమది
భవిష్యత్తు ఆహ్వానిస్తున్నది.
భవిష్యత్తు అనుసరిస్తున్నది.
భవిష్యత్తు మాత్రము పసిడికొంగును విప్పదు
దానిలో ముడివేసిన రహస్యాన్ని విడదీసి చెప్పదు.

ఆమె బ్రతుకు తెరచాపలు ఎక్కడ విప్పవలెనో
ఏ రేవున లంగరువేసి కుదుట పడవలెనో
ఏ నందనవన పారిజాతముల ఏరి
పూజాగృహమును అలంకరించవలెనో
ఎచ్చటి సంధ్యాదీపమును అభిలాషతైలముతో నింపి
వెలిగించి స్వప్నాలతో ఎగత్రోయవలెనో
జవ్వనపు అందాలను ఎచ్చట వెదచల్లవలెనో
పసిడి పలుకులతో, వెండినవ్వులతో
ఎచ్చట హృదయాల కదిపి వేయాలో
తెలుపని మూగ ముందుకాలము
ఊరించే కైసైగలతో పిలిచే పిలుపది.
తెలియని త్రోవల వెడలే ప్రయాణమది.

కాలపథమున అగ్రసర మగుచు
వయసోస్పానముల అధిరోహించుచు
ఋతు వధువుల నృత్యపరిభ్రమణల అవలోకిస్తు
వికసించిన దళాల దేహపద్మముతో
మకరందసిక్తములైన కోర్కెల పళ్లెరముతో
వికసించిన వదనారవిందయై
చందన చర్చిత బాహువులతో
గోరంట ముగ్గులు తాల్చిన చేతులతో
పువ్వుల జడనుండి వెడలే సువాసనల అలలతో
ఛాయవలెకాక సొంతమగు అధికారముతో
విపుల విశ్వాసముతో సాలంకృతయై
జీవన లీలలు పూర్వరంగమగు
వైవాహిక మండపములోనికి

హోమాగ్నుల ధూమచక్రాల మధ్య
అమ్మాయి చంద్రవదనయై
దక్షిణ పాదముతో ప్రవేశించుట ఎప్పుడో
ఏ శుభగ్రహముల సంయోగ కాలముననో
ఏ సువర్ణ సంధ్యా గోధూళి లగ్నముననో
మధ్యగగన అంకములో చంద్రుడు
వెన్నెల నవ్వువెలుగల చల్లునాడో
బుజ్జి పెండ్లికూతురు నిజమైన పెండ్లికూతురై
మంత్రోచ్చారణల మధ్య
నికట దూర భవిష్యత్తు నూపురసిక్వాణాలను
వింటూ కూర్చుంటుందో
సుమంగళీభవ అంటూ పెద్దలు పిన్నలు
అక్షతల వేసి ఆశీర్వదిస్తారో.

17.2.81, నెల్లూరు

# సుబ్బవ్వ అరుగు

ఊరిలో అందరికీ ఆమె అంటే గౌరవము
ఆమె అందరిమీద ప్రేమాభిమానాలు చూపేది
ఎవ్వరికీ అప్రియమైన మాట పలికేదికాదు.
ఎవ్వరిని గూర్చి చెడ్డగా చెప్పేదికాదు.
ముసలితనముతో దేహమువంగినా
ఆరోగ్యంగానే ఉండేది, ఊరంతా తిరిగేది.
ముసలితనపు కాలి అడుగులు
ఒంటిమీద ముడతలుగ కాన్పించేవి
సంధ్యాదేవి మ్లానముఖచ్ఛాయలు
వెంట్రుకలు బాగా నరసినా
కన్నుచూపు చెవ్వ వినికిడి మందము కాలేదు.
పని ఉన్నా లేకపోయినా ఆ చిన్నఊరులోని
నాలుగు వీధులు తిరిగి వచ్చేది.
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే
అనే ఏకపంక్తి జపాన్ని చేస్తూ నడచేది.
సంజెవేళ గుడిగంటలు వినగానే
గుడికిపోయి ప్రదక్షిణలు చేసి వచ్చేది.
అన్నివిధాల ఊరిలో ఆమెకు పెద్దరికము ప్రాప్తించింది,
రోగుల విచారించి వచ్చేది
మందుల సలహాలను ఇచ్చివచ్చేది.

శుభాలకు అశుభాలకు హాజరయ్యేది.
కొడుకులు కోడండ్రు ప్రేమతో చూచుకొనేవారు.
విలక్షణమైన విశిష్టతను సంపాదించింది.
మంచితనముచేత వయస్సుచేత గురు పీఠము పొందింది.
ఆ ఊరికి ఊడలు వేసిన మర్రి చెట్టువలె ఉండేది.

ఆ ఊరి డెబ్బదిఏడుల సమాచారాలు
ఆమెకు జ్ఞాపక ముండేవి
శతావధానికి ధారణాశక్తి వలె
పండితునికి అమరకోశ శబ్దావళి వలె.
వైయాకరుణునికి పాణిని సూత్రాలవలె.
గ్రామగతచరిత్ర ఆమెకు కంఠోపాఠము
కరువులు వెల్లువలు తుఫానులు
ఎప్పుడు ఎట్లా వచ్చాయో చెప్పేది.
చిన్ననాటి విషయాలన్నీ చెప్పేది.
రాట్నాలు వడికేవారని చెప్పేది.
మహాత్ముడు వచ్చినపుడు బంగారు మురుగులు
ఇచ్చిందని చెప్పేది.
ఖద్దరునే వాడేవారని చెప్పేది.
పెండ్లిళ్ల పేరంటాళ్ల విషయము చెప్పేది.
చలిత స్థలపురాణముగ ఉండేది.
భర్తతో వెళ్లిన కాశీ యాత్రా వివరాలను చెప్పేది.
హరిద్వారులోని శీతల గంగాస్నానాలను చెప్పేది.
ఆమెతో సంభాషణ పురాణశ్రవణముగా ఉండేది,
తడబడని మాటలతో మరపులేని వివరాలతో
రంజకముగా చెప్పేది.

ఏదైనా సందేహము వస్తే ఆమెను అడిగితే చాలు
పురాణములో పుటలు త్రిప్పినట్లు
సందేహ నివారణ చేసేది.
పూసగ్రుచ్చినట్లు విషయాలన్నీ చెప్పేది.

ఊరివాగు ఎండినరీతి
ఆకాశములో ఎగిరేపిట్ట కూలిన విధముగా
ఎండాకాలము వేడివేళల
హరే కృష్ణ అని క్షీణస్వరముతో అనలేక అంటు
రెండు నాళ్ల జ్వరముతో
శీతల మరణాంకములో ఆమె విశ్రమించింది.
ఊరిలోని వారందరు, చుట్టు మజరాలవారు
చేరి శ్రద్ధాంజలి ఘటించారు.
దహనకర్మను జరిపించారు.
ఊరు ఎన్నడు చూడనంతమంది గుమిగూడి
ఆమె కాలి భస్మము కావడం చూశారు.
అగ్ని జ్వాలలు లోలబాహువుల చాపి
తమలోనికి చేర్చుకొన్నాయి.
బూడిద కుండను ఊరిలో సమాధి చేశారు.
మీద చక్కని అరుగును కట్టి
సుబ్బవ్వ అరుగు అని పేరు పెట్టారు.
ఆమె అందరికీ అమ్మమ్మ.
అందరికీ అనురాగాల అవ్వే.
చుట్టూ పొగడ చెట్లు పువ్వుల చెట్లు నాటారు.
అదే ఊరికి నందనవనము.

మార్పులతో పెద్దలు పిన్నలు ఆడవారు
గుమికూడేవారు.
సుబ్బవ్వను తలవని రోజంటూ లేదు.
ఆమెను గూర్చే కథలు ఉపకథలు చెప్పేవారు
చెట్టు నడుమ అరుగుమీద
గ్రామ విషయాలన్నీ ముచ్చటించేవారు.

ఆమె మరణముతో స్థలపురాణమే
అదృశ్యమైనట్లుందేది.
అలిఖిత ఇతిహాసానికి కంఠము పోయినట్లుండింది.
తాతల ముత్తాతల చరిత్ర బూడిదెలో కలిసింది.
ఊరిపెద్దను కోల్పోయి
ఆమె స్మృతిగగనములో ఎగురుచుండిన
పెద్దల కీర్తులనే పోగొట్టుకొన్నారు.
గతములేని వర్తమానమైనది గ్రామము
వేరుల మరచిన చెట్టు మోడైంది గ్రామము.
మళ్ళీ దొరకని గతచరిత్రంతా కొట్టుకపోయింది.
వెనుకటి కథలను దాచిన కాలపేటికే పోయింది.
పాత జ్ఞాపకాల మర్రిచెట్టు విరిగి పడిపోయింది.
మిగిలింది సుబ్బవ్వ కథలు, సుబ్బవ్వ అరుగు
పొగడచెట్లు పెరిగి పువ్వులు రాలుస్తుండేవి
సురభిళ స్మృతికళికలుగ
ఇతిహాస దేవత ఆహ్లాదరసగుళికలుగ.

21.2.81, నెల్లూరు.

# సౌందర్యాన్వేషణ

ఆ రైతుది సంపద మర్యాదల కుటుంబము
తరాల గౌరవ గంధం జిల్లా అంతా వ్యాపించింది
వ్యవసాయము పశుపోషణ అతిథి సత్కారము
ఆశ్రిత సహాయము కుటుంబయశస్సుకు
మూల స్తంభాలు.
బీదసాదలను పేదచుట్టాలను
ఆదుకొని పోషించేవాడు
ఊరితగాదాలు న్యాయంగా పరిష్కరించేవాడు
వంశ ప్రతిష్ఠను కాపాడు కొంటామనినాడు.

చెల్లెళ్లకు వివాహాలు చేశాడు
తమ్ముళ్లకు ఆస్తి పంచియిచ్చాడు.
సీలింగులతో బీడులు తోటలు పోయాయి.
భూవసతి బాగా తగ్గినా పెద్దకాపుగానే
పేరు పొందాడు.
ఇంగువ కట్టిన గుడ్డగానే జీవించాడు
చనిపోగా, నలుగురు కొడుకులు
భూమిని పంచుకొన్నారు.
కుమార్తె పెండ్లిళ్లకై చేసిన బాకీలు పెరిగాయి.
పెద్దకొడుకు ఊరిలోనే ఉన్నాడు
మిగతావారు ఊరు వదిలి తలా ఒక దారిన పోయారు.

పెద్దకొడుకుకు భూముల మీద ఆస్తుల మీద
నమ్మకము పోయింది
అనాదిగ వస్తున్న వంశమర్యాదను
నిలుపలేక పోయాడు
చిన్ననాటి వైభవబింబాలను
వర్తమాన దర్పణములో చూచేవాడు
గోక్షీర వితరణాలు అతిథులు
పండితచర్చలు పలాయనమయ్యాయి.
భూతకాలానికి వర్తమానానికి శ్రుతి కలియుటలేదు.
అంతా అపశ్రుతిగా ఉండేది.
హృదయము కర్కశమైనది.
భూదేవి లక్ష్మీదేవి సపత్నియేయని
చంచల చపలయని నొక్కి చెప్పేవాడు
హిందూసంఘములో ఆస్తి పంపకము ముఖ్యాంశమని
సామ్యవాద బీజాలున్నాయని చాటేవాడు.
భూమిమీద బ్రతికేవాడు
పిత్రార్జితముమీద జీవించేవాడు
ఎప్పుడో ఒకప్పుడు మోసపోతాడని నమ్మేవాడు
క్రొత్త మానసిక దృక్కోణాన్ని అలవరచుకొన్నాడు
స్వార్జితులే ఉత్తములని
వారే జీవిత మాధుర్యాన్ని అనుభవించగలరని
బాలబాలికలు ఉన్నతవిద్యల నేర్వాలని
పెద్దపదవుల జీతాల పొందాలని
స్వానుభవముతో చెప్పేవాడు.

వారికి చక్కనైన కుమార్తెలున్నారు
గౌరవర్ణముతో పొడవుగ దీప్తివంతమైన

ముఖ లావణ్యముతో ఉండేవారు
వినయమే వారికి ఆభరణము
ప్రియమైన పలుకులే వారికి ఆనందము
తెలివి తేటలతో చదువులు చదివారు
సహవిద్యార్థినులు విద్యార్థులు గౌరవముగ
ఆదరణల చూపేవారు
చదువులకు అందాలకు గర్వించలేదు
పెద్దఇంటి అమ్మాయిలుగానే వ్యవహరించారు
పూర్వుల సంస్కారము వారిని విడనాడలేదు.

మొదటి కూతురు పెండ్లిచేశాడు
కొంత ఆస్తి అమ్మేశాడు
కట్నాలవద్ద పెండ్లి మర్యాదలవద్ద
మనఃతాపాలు వచ్చాయి
పెండ్లి వైభవంగానే జరిగింది
పెండ్లికూతురు అందగత్తెయని పేరుమ్రోగింది
ఆమాసములో జరిగిన పెండ్లిండ్లలో
ఆమె అందమైన పెండ్లికూతురని తేలింది
ఆమెకు పేరువచ్చింది తండ్రికి అనుభవం వచ్చింది
మొదటి పెండ్లిచేదు చవిచూశాడు
రెండవ అమ్మాయికి వచ్చిన మనువులన్నీ
తిరస్కరించాడు
జిల్లాలోని పెద్దరైతులంతా ప్రయత్నాలు చేశారు
కట్నంమాట ఎత్తేవాళ్లు నా గడప త్రొక్కవద్దన్నాడు
ఆస్తిపరుల విషయం చెప్పొద్దు అని చాటాడు
మొదటి అమ్మాయి పెండ్లి ఇటీవలనే చేశాను

రెండవ పెండ్లి ప్రస్తుతం చేయలేనని చెప్పాడు
పెండ్లి ఖర్చు రహస్యంగా ఇస్తాము, కట్నాలువద్దు
అని బ్రతిమలాడారు
తండ్రి నిశ్చలంగ నిబ్బరంగ ఉన్నాడు
మా అమ్మాయికి పెండ్లికాకుండాపోదు
బాగా చదివింది అవసరమైతే ఉద్యోగంచేస్తుంది
కాని ఆస్తినిచూచి పెండ్లిచేయనని గట్టిగా నిలిచాడు
సంపాదించే వానికే ఇస్తాను
ఆస్తి దగాచేసేది పెద్దల ఆస్తి సోమరితనాన్ని పెంచేది
ఆస్తి విలువ వారసుడికి తెలియదని వాదించేవాడు
బ్రతుకులోని చేదునుచూచినవాడు
విగత వైభవాల జ్ఞప్తికి వచ్చేవి
మంచి మంచి సంబంధాలు వద్దనుచున్నాడే
తండ్రికి వెర్రిపుట్టిందాయని తలచేవారు
తన సిద్ధాంతము మీద గట్టిగానే నిలిచాడు.

ఎవరిపట్టుదలలు వారికి ఆనందము
ఆనందానికై త్యాగము చేస్తాడు
కాలయాపన సహిస్తాడు
అతడు అందగాడు, పెద్ద చదువులు చదివి
విదేశాలలో ధనమార్జిస్తున్నాడు
సౌందర్యవతియైన భార్య కావాలని కోరేవాడు
కోరికేకాదు పట్టుదలతో ఆగి ఉన్నాడు
చాలమంది అమ్మాయిల పెండ్లిచూపులకు చూపించారు
అబ్బాయికి నచ్చేదికాదు
పట్టణాలలో చూచారు పల్లెలలో చూచారు

సౌందర్యాన్వేషణ సాగుతునే ఉండింది.
మంచిరంగు అందమైనముఖము
పొడగరి అమ్మాయికై వెదకులాట
ఈ అన్వేషణలో చాలా వసంతాలు గడిసాయి
నచ్చిన అమ్మాయి దొరకలేదు పెండ్లికాదనే తలచారు
తల్లితండ్రులు కూడ నిస్పృహ చెందారు
మంచి అమ్మాయిని చూడమని స్నేహితులకు వ్రాశారు.

మొదటి కూతురు పెండ్లితర్వాత విదేశాలలోనే కాపురం
సౌందర్యాన్వేషిని చూచింది
స్నేహితులనుండి వివరాలను సేకరించింది.
అంతకుమున్నే తండ్రి రెండవఅమ్మాయిని
ఇయ్య నిరాకరించాడు
ఆయన పట్టుదలలోనే ఉండినాడు
పెద్దమ్మాయి దేశానికివచ్చి
బాగా ఆర్జించే అబ్బాయి విషయాలన్నీ చెప్పింది
సరే, మరలవారు అడగపంపితే చూస్తాములే.
అని తండ్రి సమాధానమిచ్చాడు.
స్నేహితులు తల్లి తండ్రులకు తెలియజేశారు
తల్లిదండ్రులు వచ్చిచూశారు.
అందమైన అమ్మాయని అని తలచారు
కాని అబ్బాయికి నచ్చాలె, ఏమంటాడో
అని చెప్పిపొయ్యారు
అబ్బాయి వచ్చేలోపల మరికొన్ని సంబంధాలు వచ్చాయి
అబ్బాయి దేశము వచ్చాడు
తల్లితండ్రులు వచ్చిన సంబంధాలు

చూచిన అమ్మాయి విషయముచెప్పారు
చూచి రమ్మని పంపారు
అందరినీచూడు నిర్ణయము ఇంటివద్ద
చేసికొంటామని చెప్పారు.
అతడు రెండో కూతురిని చూశాడు
తోడనే నచ్చిందని నిర్ణయము చెప్పాడు.
మొదటికూతురు పట్టుదలవల్ల
ఆమె తల్లితండ్రులు ముందే అంగీకరించారు.
అందరి అంగీకారము ప్రాప్తించింది
అందరి మాట నెగ్గింది
అబ్బాయికి అందమైన భార్య దొరికింది
ఆర్జించేవానికే ఇస్తానన్న తండ్రిమాట నెగ్గింది
మొదటి కూతురుమాట చెల్లింది
అందమైన అబ్బాయి అందమైన అమ్మాయి
బాగా సంపాదించే అల్లుడు
కట్నాలు లేకుండ పెండ్లి వైభవంగా జరిగింది
వధూవరుల అందాలే అందరికి ఆనందంకూర్చాయి
అందమైన జంటని పొగిడారు
అందరి పట్టుదలలు గెలిచాయి
అందరిమాట నెగ్గింది
అందానికి అందం చేరింది
ఆర్జన పెరిగింది
సుఖం శుభం నలుదిక్కులూ పరచాయి.

(26.3.81 నెల్లూరు)

# అందం ఎప్పుడూ అందమే

అందం ఎప్పుడూ అందముగానే ఉంటుంది
భిన్నభిన్న కాలాలలో స్థితులలో
భిన్నసౌందర్యాలను చూపుతుంది
సముద్ర గంభీరంగ అందముగ ఉంటుంది
ఆటు పోటులలో తుఫానులో
చీకట్లో వెన్నెలలో అందముగా ఉంటుంది
అందమైన కాళ్ళమీద కుచ్చెళ్ళ మాదిరి
ఒడ్డులలో అలలు జీరాడుచుటాయి
ధ్యానముచేసే రుషివలె.
అందంగా ఉంటుంది మఱ్ఱిచెట్టు
అన్ని రుతువులలోను అందాల చిమ్ముచుంటుంది
క్రింద ఊడలు నీడలు, పైన రకరకాల పాచేపిట్టలు
పచ్చని ఆకులు ఆహ్లాదాన్ని కురుస్తుంటాయి
ఆకులు రాలిన చిగుళ్లు వేస్తున్న
శోభను చిలుకుచుంటుంది
కొండవాగు వంకర టింకర వయ్యారాలతో
చక చక పరుగెడుతూ భజన చేసికొంటు
గంతులవేసికొంటు సన్నని తియ్యని గానస్వరమువలె
అందముగా ఉంటుంది
వానాకాలములో కండరాలను పెంచుకొని

రాగాన్ని మార్చుకొని విలాసంగ ఉంటుంది
ఎండాకాలము ఏకతార తీగవలె
మెరుస్తు స్వచ్ఛమైన జలాలతో
కూనురాగముతీస్తు అందంగానే ఉంటుంది
ఎవరి అందం వారిదే
తూకంలో తూగని అందాల సొంపులు చూపిస్తుంటాయి
కొండలు అడవులు ఆకాశము
పులిపిల్ల కోడిపిల్ల అందంగానే ఉంటాయి
అందంలో పుట్టింది పెరిగిందే ప్రకృతి
ఆనందించే హృదయము కావాలె.
మెచ్చుకొనే విజ్ఞత ఉండాలె.
రసవత్తర మహాకావ్యం ప్రకృతి
ప్రకృతి సౌందర్య స్వప్న మాగాణములలో
లీలావిహారము సలుపుచుంటుంది
సౌందర్యాల వినోదిని
అలంకారాల విలాసిని ప్రకృతి.

ప్రకృతి మృణాళముపై
వికసించిన పద్మము మానవజాతి
ప్రకృతి అధరాలపై నర్తిల్లే
స్థిర స్మేరము మానవుడు
ప్రకృతిక్షితిజ నయనములలో
మెరసే చంచల విద్యుత్తే మానవుడు
ప్రకృతి శిఖరాగ్రమున అధిష్ఠించి
సర్వమును వీక్షిస్తు ధ్యానిస్తున్నాడు మానవుడు
మానవుడు తక్కువవాడు కాడు

బుద్ధిబలము ఊహాబలము ధారణాబలము కలవాడు
కార్యశూరుడు నటనా చతురుడు.
ప్రకృతిపై విజయము సాధిస్తాడు
ప్రకృతిని అనుసరిస్తుంటాడు
భూతకాల ఉదంతాలను
స్మరణలో దాచుకొంటాడు
భవిష్యత్తు గుసగుసలు వింటు
జరగబొయ్యే విషయాలను ఊహిస్తుంటాడు
హేతువాదముతో ఆలోచిస్తు
పుట్టబొయ్యేవానికై ఎదురుచూస్తుంటాడు
మాటలాడ నేర్చినాడు
స్వరలయ బద్ధమైన పాటల నేర్చాడు
కృత్రిమ స్థితుల కల్పించి
ఉచిత భావోద్వేగముల ప్రదర్శించు
నటనానిపుణుడు మానవుడు
అతడు అందాలరాశి
అందాన్ని సృష్టిస్తాడు
శాశ్వతముగ భద్రపరచి పోతాడు
శిల్ప సౌందర్యము సాహిత్య సౌందర్యము
పదికాలాలు నిలిచేవి.
మానవులలో సగముపాలు స్త్రీ
పురుషుని తలమీద ప్రక్కన కూర్చొని ఉంటుంది
స్త్రీకి పురుషుడు అందంగా కన్పిస్తే
పురుషునికి స్త్రీ దివ్యమూర్తిగ కాన్పిస్తుంది
అన్యోన్య అనురాగాలు ఆకర్షణలు
అయస్కాంతాలవలె పనిచేస్తాయి.

ప్రకృతి సృష్టి పరంపరకు
సాధనాలుగా ఉపయోగిస్తారు
వారి వారి అందాలు అనువుగా ఉన్నాయి
సౌందర్య నిధులుగ జీవతో సౌందర్యమూర్తులుగ
చలిత సౌందర్య హరిణాలుగ కాన్పిస్తుంటారు

అందమైన ఆమె ఎప్పుడు అందంగానే ఉంటుంది
సర్వవేళల సకలవేషాలలో
సకల అలంకారాలలో అందంగా ఉంటుంది
నిలిచినా, నడిచినా
పాడినా, ఆడినా, అలసటతో కూర్చున్నా
అలిగినా, కనుబొమలు విరిచినా
సంతోషముతో పులకిత గాత్రయైన
ఉయ్యేలలో ఊగుతు కాళ్లు ఆకాసముపై పు చూపినా
అర్ధనగ్న వేషముతో సముద్రతరంగాలలో
ఎగురుచు ఒడలంతా నీరును కారుస్తున్నా
మిట్టమధ్యాహ్నాము దారినపోతూ
చెట్టు నీడకై పరుగిడినా
దేహకాంతి తడిసిన బట్టలగుండ
వానలో అర్ధస్ఫుటముగ కాన్పిస్తున్నా
సంభాషణలో మౌనముగ ఉన్న
వాగ్యుద్ధములో విజృంభిస్తున్నా
దుఃఖములో ఆకులయైనా
కనురెప్పలలో కన్నీటి తేమ కన్పిస్తున్నా
చిరునవ్వు నవ్వినా, పెద్దగ నవ్వినా
పూజచేస్తున్నా, ధ్యానము చేస్తున్నా

శోభాయమానంగ ఉండేవి.
అందమైన ఆమె ఎప్పుడు అందంగా ఉండదు ?
ఎప్పుడూ సుందరమే.
ఆమె హేలా విలాసాలన్నీ
శోభలన్నీ వయ్యారాలన్నీ
విలాసాలన్నీ, వినోదాలన్నీ
సమ్మతింపుల తిరస్కారాలు
రాగద్వేషాలు క్రోధాలు
నేర్పులు చమత్కారాలు
అన్నీ అన్నీ అందానికి అందము చేకూర్చేయే.
నందనవనములో పుష్పశోభలవలె
ఉండేవి ఈ వైఖరులన్నీ
నిత్య సౌందర్యమంజరి ఆమె.
సదా లావణ్య లహరి ఆమె.

27–3–81 నెల్లూరు

# ఉగాది కవిగోష్ఠి

నూతనవత్సర శుభాకాంక్షలు అందరికీ
రౌద్రి ఏమి సాధించి వెడలిందో
సాధించలేక అసక్త్యతను చూపిందో
మనకు పరిచిత పురాణమే
క్షామ భీభత్సను పలుప్రాంతములలో చూపింది
నీరులేక పచ్చిక లేక పశువులు
మాడుటలు చూచాము
దండులు దండులుగ మనుషులు
బుట్టాతట్టలతో దూరప్రాంతాలకు పోవడం చూచాము.
ధరలు పెరిగాయి స్వార్థం హెచ్చింది.
నీతి సాంప్రదత తగ్గింది క్రొత్త వ్యాఖ్యాలకు లొంగింది.
దుర్మతి ప్రారంభము
క్రొత్త విజయాలు ఊహింపలేకున్నాము.
శాంతి మేఘము దిగంతముల కాన్పించుటలేదు.
భవిష్యత్తు తూణీరములో
ఎన్ని క్రొత్త బాణీలో ఎన్ని ప్రయోగాలో
భవిష్యత్తు ధరణీతలమున
అభయహస్తమెత్తి దీవిస్తుందో
భయదహస్త మెత్తి శపిస్తుందో ఊహింపలేకున్నాము.
జటిల సమస్యల శిరోజాల చిక్కును తీసి

దువ్వి కబరిగ చుట్టి అలంకరిస్తుందో
విరబోసుకొని, చీకటివాగుల ఎగజిమ్ముతు
పండ్లు కొరుకుతు వికట హాస్యాలతో
ప్రళయ తాండవము జరుపుతుందో !

కాలము నిష్ఠురమైనది
దయాదాక్షిణ్యాలు లేవు
కఠిన క్రూరవర్తనలు లేవు
మందహాసాలతో విహారము చేయగలదు
ఎర్రికళ్లతో నెత్తుటి కాల్వలతో
సంహారము చేయగలదు.
కాల పరిభ్రమణ చక్రాలకు
అవరోధములులేవు అగడ్తలు లేవు.
ఇచ్ఛానుసారం వీరవిహారము సల్పుతుంది.

రౌద్రి దుర్మతి పేర్లు ఎందుకు వచ్చాయో
ఎప్పుడు ఎవరు పెట్టారో
ఎప్పుడు జరిగిన విషాద సంఘటనలకో
నిర్మమ వ్యవహారాలకో పెట్టి ఉంటారు.
పేర్లను చూచి భయము చెంద అక్కరలేదు.
నీడలు చూచి సర్పభ్రాంతి పడనక్కరలేదు.
రానీ, ధైర్యంగా ఎదుర్కొంటాము.
పలాయించి ఎక్కడికి పోతాము.
ఎటు మళ్ళినా కాలము ఎదుర్కొంటూనే ఉంటుంది.
దాని వలయాలనుండి విముక్తి పొందలేము.
క్రొత్త సంవత్సరపు పెండ్లికూతురికి స్వాగతం చెప్పి
అందరు గుమికూడారు.

ప్రముఖ పండిత ప్రకాండులు కవివరులు
తెన్నులు ఎదురు చూశారు.
పురంధ్రీమణులు జలభరిత మంగళ కుంభములతో
కర్పూర నీరాజనములతో శుభగీతికలతో ఎదురు చూశారు
ఏ మంగళ మంటపమైనా గర్వించి ఆనందింపగల
ప్రతిభావంతులే విచ్చేసారు.
వారి స్వాగత ఆశీస్సులను విన ఉత్సుకులమై ఉన్నాము.

వధువు కాలు మెట్టిన వేళ ఎట్టిదో
భవిష్యత్తును మేల్కొలుప
ఏ సుప్రభాతకలగానాలతో వచ్చారో
యుగయుగాల శృంఖలాలను త్రెంప
అవమానితుల ఉద్యమాలకు ఉత్సాహము నిచ్చే
ఏ విజయనినాదాలతో వచ్చారో
వీరోచిత రణఘోషలతో వచ్చారో వింటాము
దేశవనము ఎరిగిన పాత కోకిలచే
క్రొత్త రాగసుధను చిలుకుటకై వచ్చారు.

వత్సరాది వైతాళికులకు స్వాగతం పలుకుదాము
వయస్సున పెద్దయైన నేనే
తొలి తంబూరా శ్రుతి కలుపుతాను.

పాటకచ్చేరిలో ఒకరొకరుగ పాడుతారు.
ఆనందోత్సవమును కళ్లారా చూస్తాము.
ఉగాదికి ఉగాదికి మధ్య
రుతు వధువులు ఎన్ని అలంకారాలతో

మంజీర నిక్వణాలతో
ఎన్ని హావభావభంగిమలతో నృత్యము చేస్తారో
కటాక్షవీక్షణాలతో ఎన్ని లీలా విలాసాలను ప్రదర్శిస్తారో.

1—4—81 నెల్లూరు

# ప్రేమచంద్ శతజయంతి

ప్రేమచంద్ శతజయంతిని
దేశవిదేశాల్లో జరుపుతున్నారు
ఈ శతాబ్దపు ప్రముఖ సాహిత్యకారులలో
ఒకడై వెలుగుచున్నాడు
హిందీ భాషకు నూతన జవశక్తినిచ్చి వ్యాపింప చేశాడు.
ఆనాటికాల రీతినిబట్టి ఉర్దూవారిలో
పుట్టి పెరిగిన మొలక
కొమ్మలు హిందీ గగనాల విస్తరించి
పువ్వుల గుభాళింపుల వెదజల్లాయి
కధలు నవలలు దేశ విదేశ భాషల్లోకి
అనూదితమయ్యాయి.
శరీర పటుత్వము తక్కువ
వయస్సులో జీవిత మధ్యాహ్న కాలములోనే
అస్తమించిన సాహిత్య మార్తాండుడు
అస్తమించిన పిదప సాహిత్య ధీదుతులు
మరింత ప్రకాశమంతమైనాయి
కవిత్వ మార్దవములకన్న
పౌరుషము పురుషార్ధ తత్వ విజయాలను
సాహిత్యములో ప్రతిబింబించాడు
ఉన్నదానికి విసిగి వేసారి
నూతన సమాజాన్ని సృష్టింపతలచాడు.

పల్లెటూరులో జన్మించాడు
గ్రామీణ జీవితాన్ని జీర్ణించుకున్నాడు
చిన్న ఉపాధ్యాయుడుగ సర్కారు నౌకరిచేశాడు
విప్లవ బీజాలు చిన్నవయస్సుననే అంకురాలయ్యాయి.
ఉన్నదానిని గ్రహించి తాతముత్తాతల వారసత్వమని
ఉన్నదానితో రాజీపడుట పిరికిపందల పని.
పూర్వజన్మ కర్మఫలమని వాపోవుట
కాపురుషులకే యుక్తము
ప్రేమచంద్ అట్టి దుర్బలుడుకాడు
అశక్తుడునుకాడు, కాలగమనాన్ని ధిక్కరించి
మానవ సమాజాన్ని సంస్కరించి
దుఃఖభాజనుల హృదయాలలో
ఆనందరసాన్ని చల్లాలని యత్నించాడు
సాహిత్య వేదికే ఆయన సమరభూమి
కలమే ఆయన కరవాలము
సమాజ నైరాశ్యాన్ని దారిద్ర్యాన్ని
కుటుంబములలో పాదుకొన్న
కపట వర్తనాలను అహంకార ఆచారాల్ని
రాగద్వేషాలను ఈర్ష్యలను వర్ణించి
వాని కురూప జుగుప్సాకర నగ్నత్వాన్ని
పైకిచూపి ప్రదర్శించాడు.
ఆచ్ఛాదనల మర్యాదను చెండాడి చీల్చిపారేశాడు

భూమిని ఆశ్రయించి బురదను పిసికే
కూలీల సన్నరైతుల కడగండ్లు
గుండెలు నీరగునట్టుల చిత్రించాడు.

షాహుకార్ల వడ్డీల చీకటి వ్యాపారములో
చితికిన పేదల ఇక్కట్లను గూర్చి వ్రాశాడు
పెద్దమొగుళ్ళ చిన్న పెండ్లాల నలిగిన బ్రతుకుల
కన్నీటిని చూపించాడు
సవతి తల్లుల సవతి బిడ్డల అన్యోన్య సంఘర్షణలు
వేదనలు వేడి నిట్టూర్పుల సెగలలో ఆర బోశాడు
జాగీర్దారి నవాబి పద్ధతుల పాషాణాల క్రింద
నిత్యదారిద్ర సంతానాల మూల్గులకు
మాటల నిచ్చి పలికించాడు
భిన్నమతాల వైమనస్యాలను ఆక్రోశాలను
హిందూ ధర్మవర్గ వ్యత్యాసాలను
హరిజనులపట్ల ఘృణీభావాలను చూచి
కాలధర్మానికి సమాజ వ్యవస్థకు ఎదురీదాడు
ఆడవారి సొమ్ములపై మోజు
జూదరుల త్రాగుబోతువారి వ్యసన దుఃఖాల
మూర్తుల తెరలపై బొమ్మలు గీచి వ్రాశాడు.
శతాబ్దాలుగ చీడపురుగులుగా
సంఘాన్ని బాధించే ఆచారాలమీద విరుచుకుపడ్డాడు.

శోషితజనుల ఆశాజ్యోతిగా
బీదరికపు మూగజనుల వీర్యశంఖముగా
గ్రామీణజనుల భీషణకంఠముగా
అబలుల చేతి కత్తిగా సాహిత్యసమరము జరిపాడు
సర్కారు నౌకరి కారణాన పేరుల మార్చివ్రాశాడు
ప్రభుత్వానికి జంకక అవసరమైనపుడు
రాజీనామాచేసి బయటపడ్డాడు.

వీరుడై యోధుడై కలముతోనే
సైనికుడై పోరు సల్పాడు.
కలముతోనే శ్రమికుడై కష్టించి పత్రికల నడిపాడు
కథలను నవలలను వ్రాశాడు
హిందీ సాహిత్యములో నూతన శకాన్ని స్థాపించాడు
వచనమునే ఆదరించి, భారత సాహిత్యములోనే
అగ్రశ్రేణిలో నిలిచాడు.

రష్యావిప్లవపూర్వరంగ సాహిత్యాన్ని
చదివాడు అనుసరించినాడు.
తిలక్ గాంధీజీల తీవ్రవాద వీరత్వాన్ని
అలవరచుకొన్నాడు
నెహ్రూ కిసాన్ ఆందోళనా ఉద్యమానికి
ఆదరము చూపాడు
అసహాయోద్యపు గాలుల పీల్చాడు
స్వాతంత్ర్య సమరత్యాగాలకు జోహార్లు అందిచ్చాడు
పత్రికల నడిపి తన రక్తాన్నే బలిఇచ్చాడు.
పేరువచ్చింది పేదరికము విడనాడలేదు.
రోగగ్రస్థుడై ఏబది ఆరోయేటనే మరణించాడు
సాహిత్య వీర విప్లవకారుడుగా
సైనికుడుగా శ్రామికుడుగా
సాహిత్య సేవలచేస్తూ మరణించాడు
భారతవియత్తలమున
కాంతిపుంజము అస్తమించింది.
నందనవనమున పుష్పగుచ్ఛము
తల వాల్చింది.

సాహిత్యసౌరభాలు దశదిశల గుబాళిస్తూనే ఉన్నాయి.

అమర్ రహో ప్రేమచంద్

సద్‌సాలా సలాం కబూల్ కరో.

3—4—81 నెల్లూరు

# అవమానితుని విజయము

వేను-సోదరీమణుల అభిమాన సౌభాగ్యాన్ని
కోల్పోయినవాడను.
ఉన్న నలుగురు సువాసినులుగానే
అప్పుడప్పుడు స్వర్గస్థులయ్యారు.
చిన్ననాటనుండి ప్రేమించినవారు
గారాబముగ పెంచినవారు
అక్కల ప్రేమలో ప్రత్యేక మాధుర్యమున్నది.
తల్లి మనతోనే ఉంటుంది
భార్య పైనుండి వచ్చినా తోడునీడగా ఉంటుంది
వారి కష్టసుఖాలు మనలో భాగంగా ఉంటాయి
సహభాగినులుగా ఉంటారు.
అక్కయ్యల కథ వేరు.
మనతో పుట్టిపెరిగి మరో గ్రామానికి
కుటుంబానికి పోతారు.
మనమరిచెట్టు ఎక్కడో ఊడలువేసినట్లుంటుంది
మనఊరిమబ్బు ఎక్కడో వానకురిసినట్లుంటుంది
జంకుగొంకులతో కోడండ్రుగ వెడలినవారు
కుటుంబవలయాల కేంద్రబిందువులుగ తేల్తారు
క్రొత్తవనములో పూచిన పువ్వులుగ తేల్తారు.
వారిమంచి చెడ్డలు వారివే
మనకు ప్రత్యక్ష సంబంధము లేదు.

ఎప్పుడో పుట్టినింటికి వస్తారు.
తోడనే సకారణముగానే వెడలిపోతారు.
తమ్ముడు వాళ్లను చూడడానికి పోతే
ఎక్కడలేని సంబరపడుతారు.
పుట్టి పెరిగిన ఇంటి ఆనందపు వెలుగును
వెంట తెచ్చినాడని భావిస్తారు.
దూరమగుచున్న సంబంధ స్మృతులను
మేల్కొల్పడానికి వచ్చినాడని తలుస్తారు.
పెద్దవాళ్ళయిపోయినా చిన్ననాటి అనురాగాలు
మేల్కొని పురివిప్పి నృత్యం చేస్తాయి.
తమ్ముడు వాళ్ల చూపుల ఆదరణ క్రింద పెరిగాడు
వారి బుజ్జగింపుల ఔదార్యచ్ఛాయలలోనే పెరిగాడు.
పెద్దపదవిలో ఉన్నాడని గర్విస్తారు ఆనందిస్తారు.
తమ్ముడికి చిన్ననాడు ఇష్టమైన కూరలు పిండివంటలు
చేసి తినిపిస్తారు.
ఊరివారందరి క్షేమాలు అడుగుతారు.
అమ్మాయిల' అబ్బాయిల చదువు
పెండ్లిండ్ల విషయమడుగుతారు.
ఆనంద ప్రవాహము పొంగి
తమవద్దకు వచ్చిందని భావిస్తారు.
అక్క తమ్ముడి అనురాగములో
అపురూపమైన మధురత దాగి ఉన్నది.
మాటలు చెప్పలేనంత తీపి అణగియున్నది.
అట్టి మాధుర్య పై భవాన్నుండి
తొలగి పొయ్యానని వాపోయినాను.
ఏదో ఎత్తైన శిఖరాన్నుండి

క్రిందకు పడిపోయానని తలచాను.
భార్యాబిడ్డలుండినా ఆ అనురాగము ప్రీతి
గారాబము లోపించిందని విచారించాను.
అరుదుగ దొరికే అక్కయ్యల ప్రేమ
శాశ్వతముగ పోయిందని దుఃఖించాను.

నేను చెల్లెంద్రకై అన్వేషించాను.
ఎవరైనా ఆదరాభిమానముల చూపేవారికి
అన్నయ్య కావాలని కోరాను.
కొందరు బిడ్డలకై అన్వేషిస్తారు
కొందరు ప్రేయసులకై అన్వేషిస్తారు.
రెండూ తగలాటాలే
లేనిపోని బాధ్యతనో నిందనో పొందాలె.
చెల్లెంద్ర విషయంలో బాధ్యతలేదు నిందలేదు
ఆదరాభిమానాలు పంచుకొనడమే.
అభిమానాన్ని ఇస్తాను, ఆదరాన్ని పొందుతాను.
దగ్గర సంబంధము లేని ఆత్మీయత
స్వార్థములేని అభిమానము
కడకు ఒక చెల్లెలు దొరికింది
ఒకనాడు ఎన్నికయైన విషయముకాదు
క్రమేణ అనురాగ సూత్రాలు దగ్గర కూర్చాయి
కన్పించినపుడు ఆప్యాయంగా పలుకరించడం
అప్పుడప్పుడే టెలిఫోనులో మాట్లాడం జరిగింది
ఆదరణ పూర్వకముగానే వ్యవహరించింది
మౌనమైన ప్రీతితోనే నేను అభిమానిచ్చాను.
భర్తను పిల్లలను పరిచయంచేసింది.

కొన్ని వేళల వారింటికి వెళ్లాను.
భోజనానికో టీకో పిలిచేది.
అమ్మాయి పెండ్లికి రమ్మని పిలిచింది.
దూర ప్రయాణమే చేసి పెండ్లికి హాజరయ్యాను.
అదేపనిగాపోయి చెల్లెలు ఆనందములో పాల్గొన్నాను.
పిలుపులో ఆప్యాయత కాన్పించింది.
ప్రీతితో కూడిన ఆదేశము కాన్పించింది.
పెండ్లి చూడడము కర్తవ్యముగా భావించాను.
సంతోషముగానే హాజరైనాను.
నష్టకష్టాలులేని పరస్పర అభిమానం
గతించిన అక్కల అభిమానం
ఛాయాలేశముగనైన పొందానని సంతోషించాను.
మోడుగ కాన్పించిన వృక్షము చిగిర్చిందని
ఎండిన వాగు చెమ్మగిల్లి
జలరేఖను చూపిందని సంతోషించాను.
పోయిన సంపదలో కొంతైన ప్రాప్తించిందని తలచాను.

కాల కలగానానికి ఆరోహణ అవరోహణ లున్నాయేమో
వన వసంతానికి కొంతవెనుకనే శిశిరము ఉన్నదేమో
గ్రహాలు వక్రించడం, మూఢమిలో మాయమగడం
చూస్తున్నాముగదా!
ఆమె ఏర్పాటుచేసిన ఉత్సవానికి
అచ్చు ఆహ్వానం వచ్చిందేకాని సొంతపిలుపో
టెలిఫోను పిలుపో రాలేదు.
నేను ఊరిలో ఉన్నానని తెలుసు
రమ్మని పిలుస్తుందని ఆశించాను, ఎదురుచూశాను.

కడపటినిముసములోనైన పిలుపువస్తుందేమో అనిచూశాను
ఆశలు నిరాశలయ్యాయి.
వేసుకొన్న అనురాగపు ముగ్గులు చెరగిపోయాయి.
అచ్చుపిలుపులో నాకేమీ స్థానము లేదని తప్ప
మరేమీ కారణము కాన్పించలేదు.
ఆమె ఏర్పాటు చేసే సభలో నాకు స్థానము ఉండాలని
నేనుక్రీఎన్నడు ఆశించలేదు
అంత అల్పబుద్ధితో నేను వ్యవహరించలేదు.
ఆమె నేను కోరేది పదవులుకావు స్థానాలుకావు.
ఆత్మీయతనే నేను ఆశించాను.
అకారణముగ నన్ను అవమానించిందని తలచాను.
ఉచితమైన కారణము ఊహింపలేక పోయాను.
అవహేళనా ఉదాసీనతా పరీక్షా గర్వమా
నిర్ణయించ లేకపోయాను.
పట్టుదలతో ఆ సభకు వెళ్లకపోవడమా
ఔదార్యముతో వెళ్లి కూర్చోవడమా అనే
ఆందోళనలో సతమతమయ్యాను.
ఇటు అటు ఆలోచనలో ఊగాను.
కడకు సభకు వెళ్లాలనే నిర్ణయించుకొన్నాను.
పరువుల జోలిలో దాచుకొని
పొంగుచున్న ఆవేశాన్ని అణచుకొని
పిలువని పేరంటముగానే వెళ్లాలని నిర్ణయించుకొన్నాను
ఉదారముగా వ్యవహరించడమే మేలని తలచాను
నేనూ ఆమెను అనుసరిస్తే
నా ప్రత్యేకత ఏమని ప్రశ్నించుకొన్నాను.

సభకు వెళ్లాను.
భర్త ఆహ్వాన సూచకముగ చేతులుపట్టాడు
పిలువని పేరంటముగా వచ్చానని మెల్లిగా అన్నాను.
నేనూ చెప్పాను. టెలిఫోనులో పిలువమని. కానివినలేదు
అని నిస్సహాయతను వెల్లడించాడు
కొంతసేపటికి ఆమె వచ్చింది
నేను వస్తానని ఆమె అనుకొనలేదు
ఆశ్చర్యమిశిత ఆందోళన ముఖమున కాన్పిస్తున్నది
మీరు వచ్చినందుకు సంతోషమండి అన్నది
చిరునవ్వులేని ముఖముతో.
మౌనంతోనే నా అసమ్మతిని ప్రకటించాను.
అప్పుడు మాటలు అప్రస్తుతమని తలచాను.
సభాంతరము వరకు ఉండి
కార్యక్రమమంతా చూచాను విన్నాను.

ఆమె అందరిలో ఒకరై ఉంటే
నాకు మనఃక్లేశములేదు, ఆక్రోశములేదు.
చెల్లెలుగా భావించి ఆదరాభిమానాలు పంచుకొన్నాము.
అందుకే వేదన.
ఆత్మీయుల ఔదాసీన్యమే బాధకలిగించేది.
పరాయివారి ఉపేక్షలు అవమానాలు విమర్శలు
పరిగణించాల్సిన విషయాలుకావు.
సభకువెళ్లి విజయాన్ని సాధించానని తలచాను.
ఔదార్యముతో ప్రవర్తించిసంస్కృతిని కాపాడుకొన్నాను.
పట్టింపులతో రెట్టింపులు చేసికొని
సోదర భావాన్ని విడనాడలేదని సంతసించాను.

అల్పబుద్ధితో సంకుచిత భావాలతో
ఆవేశము చూపలేదని అభినందించుకొన్నాను
అవమానములో విజయము నాదని తలచాను.
ఏడుపు కొలనులో నవ్వుల కలువను
పొందానని తలచాను.
శిథిల ప్రతిష్ఠపై భగ్నస్వాభిమాన దుర్గముపై
విజయకేతువును నాటానని గర్వించాను.
చీకటి బాటలో వెలుగు ప్రమిదెను
వెలిగించానని తలచాను.
కాని అనురాగ మృణాళము వాడింది.
ప్రీతి కమలము దళాల విచ్చుటలేదని గమనిచ్చాను.
విచ్ఛిన్న సూత్రాలు అతుకుటలేదని చూచాను.
ఆదరణ గగనములో
మైత్రీ పతంగము ఎగురలేని స్థితిని చూచాను.
అవమానితుడు విజయహాసముల చేసికొంటు
సంతోషచ్ఛాయలతో దూరప్రాంతాలకు వెళ్లాడు.
భవిష్యత్తు హర్షశంకముల ఊదింది.

5.5.81 నెల్లూరు.

# 1857

10 మే, 1857 లో ప్రారంభమయ్యింది
తొలి స్వాతంత్ర్య సమరము.
హిందువులు ముస్లింలు కలిసి
పరదేశీయుల అత్యాచారాల ప్రతిఘటించారు.
వ్యూహము సరికానందున
అనుశాసనము తగిన మేరలో లేనందున
దేశములో ఐకమత్యము లోపించినందున
సమరము విజయాన్ని అందలేక పోయింది
నాయకత్వముకూడ బలహీనంగా ఉండిందేమో
చాలమంది ప్రాణాల కోల్పోయారు.
కార్చిన రక్తములో స్వతంత్రబీజాలున్నాయి.
ఎత్తిన కంఠాల్లో వీరనినాదాలు రవళితమయ్యాయి.
హృదయాలు దేశభక్తి ఆవేశముతో భరితములయ్యాయి.
చీకట్లకొసలో అరుణోదయ రేఖ
అస్పష్టముగ కాన్పించింది.
కాని ఆ దినాల ఆవేశము, దేశభక్తి రక్తపాతము
నిరుపయోగము కాలేదు.
సరియగు కాలానికి నిరీక్షింపవలసి వచ్చె.
ముత్యపుచిప్పలోపడిన స్వాతిబిందువు
తోడనే ముత్యముకాలేదు.
నాటిన విత్తనము తోడనే పంటగ మారలేదు.

శిరోజాలు పెరిగి దీర్ఘవేణియగుటకు
కాలము కావాలె.
లతలు పెరిగి మొగ్గల తొడుగుటకు
పుష్పములగుటకు సమయము కావాలె.
ఎన్నో శ్రావణ ధారలు ఎన్నోపౌష్యతుహిన స్నానాలు
అభిషిక్తం చేయాలె.
వసంత సమీరాలు వింజామరల వీయాలె.
త్వరితముగ అకాలమున
పువ్వులు పూస్తే లాభంలేదు.
పరాజయ ఆక్రోశాన్ని మౌనంతో
కాలాన్ని దిగమ్రింగుచు వేచి ఉండవలసి వచ్చింది.
తొంభై సంవత్సరాల దీక్షానంతరము
దేశమువిముక్తిని పొందింది
మారణ యజ్ఞాలు త్యాగవ్రతాలు
పెక్కు చేయవలసి వచ్చింది
అనూహ్యమైన త్యాగప్రదర్శన చేసింది
అగ్ని గుండాలనేకములు నడచి దాటవలసి వచ్చింది
వీరోచిత త్యాగమహాకావ్యముల రచించింది.
వీరుల రక్తముతోపాటు తల్లుల కన్నీరు
దేశ క్షేత్రాన్ని చదును చేశాయి.
ఆనాడు నాటిన విత్తనము, మట్టి కోటను చీల్చుకొని
రెండు రెక్కల మొలకయై పైకి తేలింది
ఆనాటి శంఖారావము
మారుపలికింది. దేశము నలుమూలల లోయలలో
57 సం॥ నాటి దుందుభి మ్రోతలు
అన్ని ప్రాంతాల కర్ణపుటముల చొరలేదు.

ఆనాటి అగ్నిశిఖ ఏకజిహ్వయై వెలిగింది.
1947 సం॥ నాటికి సహస్రజిహ్వలతో
దేశాన్నంతా పర్వింది.
తీరముపై దుమికిన వీచి బలాన్ని పుంజుకొని
రోదసిని నింపేఘోషలతో విలోలకల్లోలమై
ఉప్పెన బలముతో తటాల శిరాల తన్నింది.
గత శతాబ్దపు 57 ఇంజన్‌కాగా
ఈ శతాబ్దపు 47 గార్డు పెట్టి అయ్యింది
పచ్చజండాతో రైలుప్రయాణం సాగింది.
57–47 ల మధ్యకాలములో దేశం
దీర్ఘ దీక్షసమాధిలో ఉండింది.
వివిధ రంగాలలో వివిధ ముఖాలతో సమరము సాగింది.
చిన్న చిన్న వ్రేటులుగా కాన్పించినా
విరాట్ వృక్షాన్నే పెకలించాయి.
సమరకేతువు విజయ పతాకమయ్యింది
పోరు పగ్గాలు గెలుపు తేరుల మోకులయ్యాయి.
మృతవీరుల ఆత్మలు జయదుర్గమున
సమావేశమయ్యారు.
విజయశంఖముల మ్రోగిస్తు
మంగళాక్షతల చల్లారు.
గణతంత్ర రాజ్యమయ్యింది
చరిత్ర ఎరుగని ఐక్యతను సాధించింది
పోయిన భాగంపోగా మిగతాది
ఒక జండా నీడలలో కుదుటపడింది
త్యాగగరిమ రాజ్యానికి వచ్చింది
ముతక వస్త్రమే రాజవేషమయ్యింది

అశోకుని ధర్మచక్రము జాతీయపతాకముపై అమరింది
త్రిముఖ సింహము అధికార ముద్రగ తేలింది
ప్రాచీముఖమున జయతిలకము భాసించింది
వీర స్వర్గము గవాక్షముల తెరచి
జయభారతాన్ని తిలకించింది
త్యాగ దీక్షచే పునీతమయ్యింది
వీరభారతము.

10.5.81, నెల్లూరు.

# యౌవనము

ఆనాటి ప్రాక్ బాలికను
ఈ నాటి చీర యువతిగా చూచాను.
ముఖమున యౌవన లావణ్యము తొణికిసలాడింది.
బాల్యపు మేఘాల వెనుక దాగి యుండిన
యౌవన ఇంద్ర ధనుస్సునే చూచాను.
కాలము ఇంద్రజాలముతో అందాల తీరును మార్చింది
బాలికకు ఎరుకలేకనే కాలచిత్రకారుడు
దేహయవనికమీద క్రొత్తరంగులతో
క్రొత్తబొమ్మను రాసినట్లుగ తోచింది.
మాతృత్వ కావ్యమునకు యౌవనము తొలిపలుకు
మానవుని అమూల్య సంపద యౌవనము.
జీవన సారము యౌవనము.
పుట్టుకతో లేకపోయినా
చావువరకు మిగలక పోయినా
యౌవనప్రియమే అతనికిమకుటాయమానంగా ఉంటుంది
దేహము మనస్సు హృదయము వికసించేది ఆ కాలాన్నే
దేహముతో పాటు మనస్సు రెక్కలు విప్పుతుంది
బుద్ధిబలము పెరుగుతుంది
ఆలోచనాశక్తి లోతగుతుంది.
హృదయము క్రొత్తభావాలతో ఊగుతుంది.

క్రొత్త ఆకాంక్షలు అనురాగాలు స్వప్నాలు
హృదయాన్ని ముసురుకొంటాయి.
దేహతటాన్ని హృదయతీరాన్ని
యౌవన తరంగాలు ముద్దిడుచుంటాయి.
యౌవన సమీరాలు వసంతాన్ని మోసుకవస్తాయి.
ప్రకృతి తనరాజ్యాన్ని విస్తరింపకోరుకొంటుంది.
సృష్టి జాలముల పేనుచునే ఉంటుంది
ఆమెను చేతి బొమ్మగా ఉపయోగిస్తుంది
యౌవనముతోపాటు సౌందర్యాన్ని ఇస్తుంది
యౌవన పాత్రలో సౌందర్యామృతమును అందిస్తుంది
యౌవన వేదికపై సౌందర్యము లాస్యముచేస్తుంది
హావభావ విలాసాలు హేలలు లీలలు
క్రొత్తతాళముతో అడుగులు వేస్తాయి.
నేర్చిన విద్యలుకావు స్వయముగ వచ్చినవే
గతిచాతుర్యాలు వీక్షణ చమత్కారాలు
క్రొత్త పాఠాలను వల్లిస్తుంటాయి
అనురాగ అయస్కాంతఆకర్షణలు
సదా మేల్కొనే ఉంటాయి.
యౌవన తూణీరమునుండి బయల్వెడలిన
సమ్మోహనాస్త్రాలే ఇవన్నీ.
ప్రకృతికి కావలసింది సంతానము
తన పరంపర సాగుచు ఉండాలె.
సంతానోత్పత్తికి యౌవనమిచ్చింది.
సౌందర్యాంశములన్నీ ఇచ్చింది
వీని భుజాలపైఎక్కి ప్రేమ స్వారిచేస్తూ వచ్చింది.
లక్ష్యం ఇంకొక తరంపుట్టాలె.

పుట్టబొయ్యే భవిష్యత్తుకు
అన్ని హంగులు రంగులు సమకూర్చింది
ప్రేమాగ్నిని ఊదడానికి కావాలె.
అందానికి జోడు
పురుషుడు కావాలె.
అతని వంశీనాదానికి
ఆమె తనువు పులకిత మగుతుంది.
ఆమె నవ్వులకు చూపులకు
అతడు సమ్మోహితుడగుతాడు.
మబ్బుకావాలె నెమలికి పురివిప్పడానికి
వానబొట్టు కావాలె చాతకానికి దప్పిక తీర్చడానికి
జ్యోత్స్న చందనముకావాలె చకోరానికి
నైసర్గిక ఆకర్షణలు చక్రాలు త్రిప్పుచునే ఉంటాయి.
భావికాల రథాలు ముందుకు పయనిస్తుంటాయి
వసంతాలు లేచి గంతులేస్తాయి
హరివిల్లులు మేల్కొంటాయి.
అగ్నిపర్వతాలు ఆవళిస్తు లేస్తాయి.
తుపానులు రెక్కలువిప్పి దూకుతాయి
వలపు తొలి అడుగులలో
ప్రకృతి మన్మథుని ముందుబెట్టుకొని
ప్రేమలీలలు సాగిస్తుంటుంది.
పుష్పదళాలను విసరుతు నుంటుంది.
అశనిపాతాల సృష్టిస్తుంది అవసరమైతే
ప్రేమ మకరందవాహిని మాత్రమేకాదు
విష వాహిని కూడా కాగలదు.
విషాదాంత నాటకాలను కూడా రచింపగలదు.

పీయూషధారల శీకరాలపై వెదజిమ్మగలదు
యౌవనం సౌందర్యము ప్రేమ
దాంపత్య జీవనానికి పునాదులగుతాయి
ధ్యేయం సంతానం
దంపతుల కన్న ప్రకృతి కోరేది సంతానం
క్రొత్తతరం రావాలె.
మరలా యౌవనం ఉదయించాలె.
మరలా సౌందర్యం ప్రేమ దాంపత్యం
సంతానం కావాలె.
మానవధారా వాహిని సాగుతుండాలె.
సంసార నాటకములో కీలకపాత్ర
యౌవనం వహిస్తుంది
శాశ్వతంగా ఉండేదికాదు.
యౌవనాన్ని వార్ధక్యం మింగేస్తుంది
చావు వార్ధక్యాన్ని మింగేస్తుంది
అన్ని బాధలను సుఖాలను మింగేస్తుంది
శాశ్వత శాంతిని చేకూరుస్తుంది
యౌవనం కోరికల పెంచేది
ముందుకు చూచేది నడిచేది
మానవుని అమూల్య సంపద యౌవనము.
జీవన సారము యౌవనము.
స్వల్పమైన ఆయుస్సులో
ఇంకా స్వల్పము యౌవనము.
అతి స్వల్పయౌవనములో
జరగాలె సృష్టి.

13.5.81 నెల్లూరు.

# చెలిమి

వరద కాదు
ముంచడానికి, నాశనము చేయడానికి
మాయమగడానికి
నెమ్మదిగా ప్రవహించే
స్వచ్ఛమైన జలము.
పువ్వుకాదు
వడివడిగ వికసించి
గుభాళించి
ఒక్క రోజులో వాడిపోవడానికి
రెక్కలు విడిపోవ
చావుఒడిలో పరుండడానికి.
తీగకాదు
ఓరిమి లేక
పెరిగి ప్రాకి చుట్టుకొని
పూచి, తుమ్మెదల ఆహ్వానించి
తేనెను అందిచ్చి
ఒక్క రుతువులో వీడ్కోలు చెప్పి
వెడలి పోవడానికి.
దీర్ఘము కాని వర్తమానము.
అందాల వారసత్వము లేదు
శోభావైభవాల భవిష్యత్తు లేదు.

పరిమిత వర్తమానములోనే
అన్ని సుఖ సంపదలు.
చెలిమి మెరుపువలె.
మెరిసి మబ్బుల తెరలో
దాగేదికాదు, అణగేదికాదు.
చెలిమి ఒకచెట్టు.
తీరికగ పెరుగుతుంది
ఓపికతో మనుతుంది.
తొందరలు దానికి అయిష్టము.
నెమ్మదిగ కంటికి కాన్పించకనే
పెరుగుతుంది.
ఎండలు వానలు మంచులు
అనేకాలు చూస్తుంది
ఆకులు రాల్తాయి
చిగుళ్లు కోయిల కూతలకు మేల్కొంటాయి
పిట్టల పిలుస్తుంది కొమ్మల చేతులతో
ఆకుల మరుగులలో, కొమ్మల సందులలో
గూళ్లు కట్టుకోమంటుంది
ఆవులకు మేకలకు నీడల నిస్తుంది
బాటసారుల చెమటల ఆరుటకు
తెమ్మెరలే విసనకర్రలై వీస్తుంది.
మట్టి చీకట్లలలో గింజకు పుట్టినా
తీరికగ వెలుగులోనికి వచ్చి
తన రెండు రెక్కల విప్పి
తోడనే ఆకాశములోనికి ఎగురదు.
నిదానమును నేర్పుతుంది.

కొమ్మలు వేరు దిక్కులకు పోయినా
ఒకటి నొకటి అర్థము చేసికొని
మనోహరమైన మేళవింపుతో
మధురత్వాన్ని విరపోస్తాయి.
కనబడని వేళ్లు లోతులకు పోతాయి.
కనబడే మాను కొమ్మలు రెమ్మలు
ఆకులు నిండు మేళకర్తగ రవళిస్తుంది
ఎన్నో నూపుర నిక్వాణాలు !
రమ్యమైన నృత్యాన్నే మేల్కొలుపుతుంది
భిన్నత్వములోని ఏకత్వము చాటుతుంది.
స్వరాలు వేరైనా సంగీతము ఒక్కటే
శిఖరాలు వేరైనా పర్వత మొక్కటే
ఒకదానితో ఒకటి కలిసి
అంతరనిహితమైన ఐక్యతను చూపిస్తాయి.

అందరికీ కాన్పించని
విశేష ఆదరణ ఉండాలె
చెలిమి చెట్టుకు.
త్రవ్వడాలు నీరుపోయడాలు
సత్తువలు వేయడాలు
పదిమందిలో చెలిమివేరు
ఏకాంతములో చెలిమి మేలు.
గరుకుతనాన్ని తుడపడానికి
దోషాలు మరవడానికి
మౌనంగా హృదయాలు కలియడానికి
ఏకాంతము తీరిక ఓపిక ఉండాలె.

చెలిమికి మెరుగు పెట్టుతుంది ఏకాంతము
ఆత్మీయతను వాడి చేస్తుంది
అభిమానాన్ని వేడిచేస్తుంది
పొరపాట్లు దొరలని ఏకాంతతలు
చీకట్లనెమకని ఏకాంతతలు
దొరకుట దుర్లభము.
అవే చెలిమికి ఆభరణాలు.
అవే మూల సంపద.
అవసర మొచ్చినపుడు
పనికివచ్చే మిగుళ్లు, పాతరలు.
చెలిమికి నిజాయితీ ఉండాలె.
కపట వర్తనాలు ఆడంబరాలు
ప్రగల్భాలు పొసగవు.
త్వరలోనే తేలికయగుతాయి.
సత్యదూరము లగుతాయి.
చాలాకాలము మనలేవు.
శుష్క వాచాలత్వమగుతుంది.
నటనగుతుంది.
సత్యానికి మెరుగులు తళుకులు
అక్కరలేదు.
నిరాడంబరపు నీడలలోనే
చెలిమిచెట్టు శోభల కూదుస్తుంది.
ఔదార్యము చూపాలె.
చిన్న దొసగుల మరవాలె.
జ్ఞాపకాల సంచిలో వేసికొని
దెప్పడానికి వాడరాదు.

ఇద్దరు వ్యక్తులు ఏకాభిప్రాయులుకారు
భావాలు అభిమానాలు అభిరుచులు
వేరుగా ఉండొచ్చు.

హృదయాలు కలిసినా
ఆకాంక్షలు వేరు, ఇంకా స్వప్నాలు వేరు.

ఇద్దరూ ఒకటై పోతారను కోవడం పొరపాటు
వ్యర్థమైన వాదోపవాదాలు కొరకావు.

అప్రియమైన విషయాల ప్రస్తావనకు తేరాదు
స్నేహితుల విమర్శల పాడికాదు.
పొసగని విషయాల చర్చకు తేరాదు
విరుద్ధ భావాల ప్రసక్తి మానాలె
మంచిని మెచ్చాలె.

మొరటుగాని నుతి చేయాలె
ఇతరులకు కొంతతావు వదలాలె.

ఈర్ష్యపడుతు కూర్చుంటే చెట్టు మాడిపోతుంది.

పెక్కు ముళ్లకోటల దాటుకొంటు
పెక్కు గరకుతనాల రాచివేస్తు
పదిమందిలో శ్రద్ధ చూపిస్తూ
ప్రత్యేక స్వల్ప మర్యాదల ప్రకటిస్తు
ఓరిమితో పెంచాలె చెలిమిచెట్టును.
అప్పుడే అది పదిదినాలు మనేది.

ప్రాప్తమైన అదృష్టం
భద్రంగ సంరక్షింపబడేది.

మకరందాలు ఊరేది
అమృతసోనలు పారేది.
అమూల్యమైనదే చెలిమి.
వరప్రసాదమే చెలిమి.

17.8.81 నెల్లూరు.

# సరసుడు కాడు

క్షణిక వర్తమానానికి
అనంత భవిష్యత్తు.
నడిచే మట్టి క్రింద
ఎన్ని శతాబ్దాలుగ దాగి ఉన్నాయో
ఎన్ని ఖనిజాలో, ఎన్నిరసాయనాలో.
చిటికెలో ఇమిడే బీజము
ఎంతపెద్ద మర్రిచెట్టు కాగలదో
ఎన్ని శాఖలో ఎన్ని ఊడలో
సముద్ర అగాథాలలో
ఎన్ని కొండలో ఎన్ని లోహాలో
ఎన్ని జలచరాలో.
విద్యుత్ బల్బుకు వెనుక
ఎన్నిమైళ్ల తీగలో యంత్రాలో
ఎంత విజ్ఞాన నైపుణ్యమో.
నర్తకి నాట్యం వెనుక.
గాయకురాలి సంగీతము వెనుక
ఎంత దీర్ఘకాలసాధనో దీక్షో
వాన బొట్టు వెనుక
ఎన్ని నైసర్గిక పరివర్తనలో.
గగన నక్షత్రాల వెనుక ముందు
ఎన్ని వేల కోట్ల మైళ్ల శూన్యమో.

కాన్పించేది సూక్ష్మము
వెనుక అనంత విశాలత విపులత
మెరుపుల నవ్వుల వెనుక
పిడుగుల ఘోషలు.
ఎండల వీపుపై వచ్చేవసంతము వెనుక
కుండపోతల వానలు వరదలు
మానవుని వెనుక
ఎన్నితరాల తాతలో ముత్తాతలో
శిలా శిల్పాల వెనుక
ఎందరు పౌరులు పోగొట్టుకున్న కళాకారులో
ఎల్లోరా, హలిబిడ్ నిర్మాణాల వెనుక
వందల కుటుంబాల అకుంఠిత దీక్షో
శిల్ప నైపుణ్యమో.
రాష్ట్రపతి వెనుక
దేశగౌరవ ప్రతిష్ఠలు దాగిఉంటాయి
ప్రధానమంత్రి వెనుక
పాలనారీతి శక్తిసామర్థ్యాలు
పర్చి ఉంటాయి.
స్థూపాల విహారాల వెనుక
బౌద్ధభిక్షుకుల ఆత్మోత్సర్గము.
హరినామ కీర్తనచేయు ప్రహ్లాదుని వెనుక
భీషణమూర్తి నరసింహుని రక్తపానము.
శుష్కకాయుడైన గాంధీజీ వెనుక
వేల సత్యాగ్రహుల దండు
త్యాగదీక్షా పతాకలతో కన్పిస్తారు.
అల్పాక్షరములతో

అనల్పార్థముల చూస్తారు పండితులు.
సూక్ష్మము వెనుక స్థూలము
అల్పము వెనుక అనల్పాలు.
సీమల వెనుక అసీమలు గోచరిస్తాయి.
ఆమె మృదుభాషిణి.
మితభాషిణి ప్రియంవద.
ఎవరిని ఆక్షేపించదు. విమర్శించదు.
సుశీల సుస్వభావ.
మధ్యాహ్నపు ఇష్టాగోష్ఠిలో
అతడు సరసుడు కాడు అన్నది.
అతను సరసుడు.
అతను సరసుడు కాడులో
కొండంత వ్యత్యాసము దాగియున్నది.
ఆవేశరహితంగానే గంభీరంగానే
కాడు అని ప్రకటించింది.
ఆ కాడు వెనుక
ఎన్ని విన్నమాటలు, వదంతులు
ఎన్ని జ్ఞాపకాలు, ఎన్ని అనుభవాలు
అణగి యున్నాయో.
అన్నిటి సంపుటీకరణమే, క్లుప్తీకరణమే
ఈ కాడు.
వాని స్వభావాల ప్రభావమే ఈ కాడు.
ఏదో దాగియున్న తూడుమీద
పూచి కాన్పించే తామర పువ్వే ఈ మాట
రాలగా రాలగా మిగిలిన పూతకు
కాసిన పిందె ఈ మాట.

కారు మబ్బుల నుండి
కారిన వాన బొట్టే ఈ మాట
పెద్దకొలిమిలో రేగే నిప్పు రవ్వే ఈ మాట
పెద్ద కొండ రెక్కల త్రుంచు
వజ్రాయుధపు వాడిని చూపు ఈ మాట
కాదు అను రెండు అక్షరాలు
ఒకటి గురువు ఒకటి లఘువు
తూపుల వలె ఎగిరాయి
ఆమె ముఖ తూణీరమునుండి.

సరసుడుగ కాన్పించే ఆవ్యక్తి
పెద్దపదవుల ఆశించే ఆ వ్యక్తి
పెద్ద పాండిత్యము ప్రచారము పొందిన ఆ వ్యక్తి
కాదు అను తీర్పు నిచ్చింది.
ఆ సరళ స్వభావ మితభాషిణి.
ఆ ముక్తసరి తీర్పు వెనుక
ఎన్ని ఉదంతాల జ్ఞాపకాలు అణగియున్నాయి
ఊహ ముద్దిడ లేని స్మృతులు.
స్వర్గపు ఎత్తుల నుండి పడ్డాడు
త్రిశంకుని వలె.

అయ్యో పాపం ! ఆ స్వర్గచ్యుతుడు
ఆ కాని సరసుడు
పండితుడై సరసుడుకాని పెద్ద మనిషి.

26.3.82 నెల్లూరు

# వానప్రస్థము

మొన్న మొన్ననే దాటాయి యాభై యేడులు ఆమెకు
ఆ రూపవతికి వివేకవతికి
చిన్ననాటి నుండి పరిచయాలు పురాణాలు
బాగా చదివింది బాగా వ్రాస్తుంది
సాహిత్య సభలలో కాన్పిస్తుంటుంది
అరుదుగ మాట్లాడుతుంది.
తయారై రమ్యంగ ఉపన్యసిస్తుంది
ఆమెకు ఉల్లాసం వినేవారికి ఆనందము
ఇటీవల చాలనాళ్లకు కలిశాను.
బాగా అలంకరించుకొని ప్రయాణానికి
సిద్ధమై కూర్చుని యున్నది.
పట్టుచీర, క్రొత్తగ కొన్న రవల కమ్మలు
కొంత రంగు శిరోజాలకు
హిమానీ అలమిన ముఖం ఎర్రబొట్టు
దిద్దిన కనుబొమ్మలు, కాటుక కన్నులు
తేలిక రంగు పెదవి మొగ్గలకు
ఎర్రరంగు గోళ్ల చిగురులకు
పలుచని సువాసన దేహానికి వస్త్రాలకు
అచ్చంగా అజంతా సుందరి కబరి
వస్త్రాలతో శ్రుతికలిపే పువ్వులచెండు
సిసలైన నాగరిక ఆధునిక

విలాసిని వలె కాన్పించింది.
మెడలో ముంజేతికి వ్రేళ్లకు
తగిన ఆభరణాలు.

మంచి వేళకే వచ్చాను.
ఎక్కడికీ ప్రయాణపు తొందరులు
అలంకార ఆర్భాటాలు
సాహిత్య సభలకా, వనితా మండలి వినోదాలకా
అని కుశలప్రశ్నల పిదప అడిగాను.
వానప్రస్థానికి కాదుగదా అని నవ్వాను.
అదేమిటండో అని కుతూహలముగ అడిగింది
యాభైయేళ్ల పండుగులకు దంపతులు
దక్షిణదేశ యాత్రకు, కన్యాకుమారి వరకు
వెళ్లామని చెప్పారు గదా !
అప్పుడు నేను అనుకొన్నాను
ఇది ఆమె తుది తీర్థయాత్ర, వినోదయాత్ర
వానప్రస్థానికి మొదటి మెట్టు
శాస్త్రిలు పురాణాలు చెప్పాలి గదా
యాభైయేళ్ల పిదప వానప్రస్థము
డెబ్భైయెదుకు సన్యాసము
ఈ తయ్యారీ వానప్రస్థానికా ?
మీకు పురాణాల మీద బాగా నమ్మకము గదా!
పుడమి కోరిక తొడిమల త్రుంచుకొని
కృష్ణా రామా యని జపిస్తు
మోక్ష మార్గాన్ని అనుసరిస్తు
జన్మరాహిత్యానికి మెట్లు కట్టుకొంటు

వైరాగ్యభావము ముదిరిన మీద
సన్యాసియై శ్రీ కృష్ణ చరణార విందములను
భక్తిరస ధారలతో కడుగుచు
ఎక్కడో ఎవరికి తెలియని
పుణ్య క్షేత్రములోనో మానస తీరములోనో
కైవల్యము పొందమని గదా
మనపురాణాల సారాంశము.
కడపటిసారి వధూవేషమును ధరించి
నేటి నారచీరల–షిపానులు, నైలానులు
ధరించి మనఃశాంతికై
ఏ కొడైకెనాల్ ఉదకమండల వనములకో
వెడలుచున్నారేమో అని తలచాను.
అంటూ వ్యంగ్యముగా నవ్వాను.
ప్రస్తుతము గృహస్థాశ్రమ
ప్రథమ మంగళోత్సవములకే
వెడలుచున్నాను.
స్నేహితుల అమ్మాయికి నేడే వివాహము.
వస్తానని ఒప్పుకొన్నాను.
పురాణాల వానప్రస్థమా!
యౌవనులే గ్రహస్థాశ్రమ ప్రథమదినములలోనే
ప్రణయినులై అడవులకు చనుట యుక్తమని
సౌందర్య పూజారి రవీంద్రుడు
ప్రకటించాడుగదా
ప్రకృతి శోభల తిలకిస్తు తన్మయత్వములో
స్వేచ్ఛగ అద్వైతసిద్ధిని అనుభవిస్తు
యౌవనోత్సవములకై హర్ష శంఖముల ఊదుకొంటు

పుష్పదళాలతో హృదయ సీమల
రంగు రంగు ముగ్గుల వేసికొంటు
రమ్యగీతికా మాలల అల్లుకొంటు
విహరిస్తు కాలహృదయాన్నే మురిపింప
వచ్చును గదా
తమ ఆనంద తనువులలో
తరుణ తరుస్నిగ్ధతలను
కోమల వల్లికా పేశలతలను
పల్లవ అరుణిమలను
ముకుళ ముగ్ధకాతరతలను తిలకిస్తు
నక్షత్రాల చాందినీ క్రింద
పులిన సైకతాలలో, పుష్పశయ్యలమీదో
మంచు దుప్పట్ల క్రిందో పరుండి
పక్షుల కలరావాల వైతాళిక స్వరములకు మేల్కొంటు
నదీనదాలకు శ్రుతికలుపుచు
మర్రిఊడల ఉయ్యేలలో ఊగుచు
యుగళ గానాల పాడుకొనవచ్చునని
నికుంజ విహారాలలో శీతల జలక్రీడలలో
వెన్నెల చెట్లనీడల దాగుడుమూతలలో,
చీకటి తెరమాటులలో
దేశకాలముల విస్మరింప వచ్చునని
ఋతురమణుల వేషభూషల మార్పులను
గమన చాతుర్యములను అవలోకిస్తు
యుక్త రసమాధుర్యములను క్రోలుచు
అలౌకికానందముల పొందవచ్చునని
రవీంద్రుడు సూచించెను గదా!

వారి రససిద్ధాంతములో
ఔచితీ వివరణలో
ధ్వనిచర్చలో విశ్వాసమున్నదాన్నే
ఆ ఆలంకారికుల జట్టులో చేరి
వధూవరుల చిగురు వలపు విందులకు వెడలుచున్నానని
గంభీరంగ కవితాత్మకముగ
యూనివర్సిటీ ప్రొఫెసరు మాదిరిగ
పాఠము చెప్పింది.
ఎవరండి, ఈ నాళ్లలో ఈ నాలుగు
ఆశ్రమాలను పాటించేది ?
యాభై సంవత్సరాలకు వానప్రస్థము
డెబ్బైఐదుకు సన్యాసము తీసికొనేది?
జడ్జీలు, మంత్రులు, వ్యాపారస్థులు
వైద్యులు, లాయర్లు—వారి పుట్టుక తేదీల
గమనించి చూడండి
విరమణ వయస్సు పెంచాలని కోరేవారే
తగ్గించమని ఎవరైనా కోరారా ?
పుట్టుక తేది తప్పుగా పడింది
సవరించి మరి కొన్ని ఏడులు
పదవిలో ఉండనియ్యండి అని
కోర్టుల వేడుచున్నారే !
కడకు గాంధి, టాగూరు, నెహ్రూలు
వానప్రస్థము చేశారా, సన్యాసము స్వీకరించారా?
మీకు డెబ్బైఐదు కాబోతున్నది
సన్యాసము తీసికొని కాషాయవస్త్రాల వేయబోతున్నారా?
ఋషీకేశానికి వెడల బోతున్నారా

అని ఎదురు ప్రశ్న వేసింది.
నేను ఏదో కావ్యాలు పురాణాలు
చిన్నతనములో చదివానని
వానప్రస్థము స్వీకరించాలని ఉపదేశిస్తు
వేళాకోళము చేస్తున్నారా
చేయండి అంటూ పెండ్లికి వెడలింది
నాకు సిగ్గేసింది
నివ్వెరపోయి చూస్తూ నిలబడ్డాను.
కాలాలు మారాయి, కాలచక్రం తిరిగింది
యుగధర్మానికి అనువుగ పాతకావ్యాలకు
క్రొత్త అర్థాలు చెప్పే అభినవ మల్లినాథులు
పాతపునాదుల మీద క్రొత్తకట్టడాలు కట్టే
విశ్వేశ్వరయ్యలు పుట్టాలె.
పాత గోడలకు క్రొత్తరంగులు వేయాలె
మనతోటల్లో విదేశీచెట్లను నాటాలె
దిగుమతియైన కూరగాయల తినాలె
క్రొత్త వేషాలు వేయాలె
క్రొత్త మాటలు పలుకాలె
అంటు నవీన ధర్మమంత్రాలను జపిస్తు
ఇంటికి వచ్చాను.
ఇల్లాలు క్లబ్బుకు వెళ్ళింది.
ఆలస్యంగ వస్తానని వెళ్ళింది.

నెల్లూరు, 6 4.82

# మరలిన కపోతములు

మామిడి చెట్టు పూతతో నవ్వుచున్నది.
పిందెలతో ఆనందాన్ని పట్టలేక యుంది.
ఎండలు పూర్తి ప్రతాపమును ఇంకా చూపలేదు.
వసంతపు మండపములో
గ్రీష్మతూర్యనాదాలు వినబడుచున్నవి
మధ్యాహ్నము చేరినాను ఆమె ఇంటికి.
చాలా కాలానికే కలిశాము.
వింతయైన కానుక తెచ్చానని అన్నాను
ఊహించని ఆసించని బహుమతినే తెచ్చాను
అనగానే ఆమె కుతూహలము పెరిగింది
కన్నులు ప్రశ్నార్థకంగ చూచాయి.
మరేమీ కాదండి మీరు వ్రాసిన ఉత్తరాల సంచి
ఎంతో ఆప్యాయముతో ఆదరముతో
చాల కాలముగ వ్రాసిన ఉత్తరాలు.
కలహమున ఇస్తున్నవి కావు
మనఃతాపముతో ఇస్తున్నవి కానేకావు
ఆనంద శీకరాల చల్లుచు
స్నేహవార్తల సౌరబాల అందిస్తూ చేరిన జాబులు
చదివి చదివి సంతోషించుకొన్నవి
విలువగలవిగ భద్రంగ దాచుకొన్నవి
అవి నా సొంతాలు.

అవి నా పిల్లలకు ఏమీ కావు
నా వారసత్వముగ వారికి ఉపయోగించవు
ఆత్మీయత ఆదరణ ఆనందము
అందు వారికి కాన్పించవు.
అందుకొన్నవారికీ వ్రాసినవారికీ
తెలుసు వాని విలువల ఆధిక్యము.

మీరు ఎగురవేసిన కపోతాలు
చాలా కాలానికి మీ ఇంటికి మరలి వచ్చాయి
రాగాలాపన ఎగిరి వక్రచాలనముతో
దూకినట్లు పల్లవి వేదికకు
మీరు హృదయముతో పెంచి, అనురాగముతో అల్లిన
పరిమళ ప్రసూనాల హారాలు కాలముచే క్రమగ్గి
మీకు సందిగ్ధ విహ్వలతను చేకూరుస్తూ
మీ అంకములో శయనించుటకు వచ్చాయి
అభిమానములో పుట్టి,
ఆత్మీయ సౌరభము చిమ్మిచు వెడలాయి.
సౌగంధిక గుణాన్ని వమ్ముచేయక
రెట్టింపు మూల్యంపదతో వచ్చాయి.
వానికి ఆశ్రయము కావాలె.
ఆదరణ కావాలె.
మనము పరస్పర శ్రద్ధాదరములతో
మెలకువగ వర్తించాము
గౌరవశిఖరాలమీదే క్రుమ్మరినాయి
మన అనురాగ మేఘాలు
కామ అరుణిమ సోకని
స్నేహభావ ధవళతే

మన హృదయగగనాన్ని పర్వియుండింది.
స్వచ్ఛమైన అభౌతికమైన ఆత్మీయతే
మనల పోషించింది.
స్త్రీ పురుషుల స్నేహము
శృంగార ప్రేమై యుండాలనేది మన సంఘము
పవిత్రమైన ప్రేమ శబ్దానికి
సంకుచితార్థము నిచ్చుకొన్నది.
ఇరుకైన వ్యూహములోనే
కూరుకొన్నది సమాజదృష్టి
అధోముఖము చూపని స్నేహచ్ఛాయలతోనే
పెరిగాయి చెలిమికొమ్మలు
మీరు నాకు సోదరివి కావు
ప్రేయసివి కావు
స్వార్థమెరుగని అనురాగ మైత్రీ సూత్రాలు
బంధించాయి మనల.
కోరికల క్రిందిచేయి ఎరుగని చెలిమి
అహంకారాల పైచేయి తలపులోనైన లేదు.
ఇచ్చేది తీసికొనేది ఏమీలేదు
ఆత్మీయతా పరిమళాలు తప్ప.
మీ ఉత్తరాల శ్రావ్య రవళికి
నా హృదయము మారు పలికింది
కరువు దినములలో వానలకువలె
ఉత్తరాల రాకకై ఎదురు చూచాను
మరల మరల తీరికవేళల ఆగి ఆగి
చదువుకొన్నాను.
ఆనంద సౌరభ సమీరాలు వీచేవి

హృదయ వనమున.
దూరదిగంతముల నుండి
మనోహర మురళి మ్రోగినట్లుండేది.
వేకువన నదీజలముల ప్రతిబింబిస్తు
శుక్రతార సైగలతో పిలిచినట్లుండేది
తేలికయైన వ్యాఖ్యలు, వ్యాఖ్యానాలు
చేసికొన్నాము.
ఓటమిలను, చిన్న గెలుపులను
సిస్సంకోచముగ స్వీకరించాము.
పారుష్యము, కాఠిన్యము
వాడి వేడి లేని మాటలే వ్రాసుకొన్నాము
పట్టింపులు విడనాడాము
దాగిన నుతి ఉండిందేమో
ఆతిథ్యాలలో పులుపు కారముకన్న
తీపే ఎక్కువగ ఉండిందేమో,
వ్యంగ్యముగ బాధవేయని బాణాలను
పూబంతులతో మెల్లగ విసరు కొన్నామేమో!
విజయ మందహాసాలు, వికటహాసాలు
కాన్పించాయేమో అటనట
జానపద సరసాలు మొదలు
రాధ ప్రేమోత్కంటత వరకు విస్తరిల్లాయి
సాహిత్యపు పందిరిలోనే
పాకాయి మన జాబుల తీవెలు
వ్యక్తిగత అనుభూతులు అనుభవాలు
మనోహర దృశ్య వర్ణనలు గోచరించేవి
ఆనంద చందన చర్చితములై వచ్చేవి

కవితాభరణములతో ఘల్లుమనేవి
ఏదో అజ్ఞాత రాగసుధను పరిచేవి
రసప్రకరణమే అయ్యింది
మన జీవన కావ్యంలో.

కిష్కింద యుద్ధకాండలు లేని
సుందర కాండమే ఈ ఉత్తరాల రామాయణము
రససిక్తములై మధురభరితములైన
ఉత్తరాలు ఇన్ని మరెవ్వరు నాకు వ్రాయలేదేమో
బహూయేడుల పరిచయము కాకపోయినా
ఆత్మీయతపూల ఉయ్యేలలో ఊగింది
వెగటులేని తీపి, అలలలో తేలింది.

అయితే, ఎందులకు తిరిగి ఇస్తున్నారనే
ప్రశ్న నీ మౌనముఖములో కాన్పిస్తున్నది
హృదయ నీరాలలో తామరవలె
ఊగుచున్నది ఈ ప్రశ్న
అర్ధనిమీలిత నేత్రాలతో
హృదయము అడుగుచున్నవి ఉత్కంఠముతో
గంభీరంగ వినండి సానుభూతితో వినండి
నాకన్న చిన్నదానవు నీవు
ఆ వ్యత్యాసము నా తర్వాత నీకు మిగిలేది
పుడమి గూటిని వదలి
తెలియరాని శూన్యాలకు, చుక్కల వైగ పిలుపున
నేను చనిన పిదప
వ్యత్యాసపు వత్సరాలు నీకు నిండాలెగదా
వద్దన్నా కద్దన్నా జరిగే విషయముగదా.

అప్పుడు తీరిక వేళల, మూలదాగియున్న
ఉత్తరాన్నొకదానిని తీసి చదవండి
ఎన్నడో అదృశ్యమైన ఆత్మీయుని
హృదయనికుంజములో గుభాళించి
కాలవశమున సుగంధము చెరగిపోవ
ఏదేని లేశము ఇంకను అంటియున్న
మూర్కొన, గుసగుసలలో పలుకగలదేమో
దూరశ్రవణ సంభాషణలోవలె వినండి
ఒకనాటి నూపుర ఝుంకారము
స్మృతి వేదికపై అస్పష్ట ధ్వనిగనైన
వినబడగలదేమో చూడండి.

తెలియును, కాలము చిత్రమైనది.
నిష్ఠురమైనది దయాదాక్షిణ్యములు లేనిది
తీరికలు ఓరిములు తక్కువ
మంచి చెడ్డ బొమ్మల తుడిచేస్తుంది
గాయాల నొప్పుల తీరుస్తుంది
సుఖాల పువ్వుల వారుస్తుంది
పగల వేడిని ఆర్పుతుంది
ఆనంద ప్రదీపాలను ఊదేస్తుంది
కాలానికి మాన్పేశక్తి లేకుంటే
మానవాళి ఏమైయుండేది
దుఃఖానల శిఖలలో నిత్యము మ్రగ్గిపొయ్యేది
ఎన్ని శోక గరళగిరులనైన మ్రింగ గలిగేది కాలము
క్రిందపడ్డ మనిషిని లేవనెత్తి
మట్టిని తుడిచి నిలబెట్టేది కాలము.
శతధన్వంతరుల పని చేస్తుంది కాలకరుణహస్తము.

చంపేది కాలమే, బ్రతికించేది కాలమే.
కాలము కవచముగా ఉపయోగిస్తుంది.
ఆ రాబోవు కాలాల్లో, తీరుబడి సమయాల్లో
స్మృతి వనాల్లో ఆత్మీయతాంకురాలు
శేషించియున్న, ఒకటి రెండు జాబుల చదవండి
ఏ గ్రీష్మ సంధ్యనో మబ్బులు ముసిరి
ఎడతెగని వానకురుస్తున్న వేళనో
శారద హృదయముననో
పనిలేని వేళల, జాబుల సంచిని తీయండి
ఒకటో రెండో చదవండి
పాతజ్ఞాపకాలు తట్టి లేపగలవేమో చూడండి.
ఆశక్తిని పోగొట్టుకొన్న
కడగ నెట్టివేయండి, ఉపేక్షించండి
చింపేయండి, భోగిమంటలో తగలేయండి.
ఇతరులకు కొరకానివి గదా
ప్రాణము పోయిన కాగితాల కుప్పే వారికి.
విచిత్రమైన కానుకే తెచ్చాను
మీ ఉత్తరాలు మీకే ఇస్తున్నాను.
గంగాపూజ గంగాతోయముతోనే చేస్తున్నాను.
ఉంచండి కొంతకాలము ఓపికతో.
మీకు శుభమగుగాక, సుఖమగుగాక అని లేచాను.
కన్నీటి బొట్టు సంచిమీద పడింది
గుండె బరువుతో తేలిక చేతులతో
ఎండలోనే ఇంటికి మరలాను.
మామిడి పూత ఒంటి మీద రాలింది.

23.4.82 నెల్లూరు.

# పేరు - ఆనందము

పేరు లేకుండానే మనిషి పుట్టాడు
తర్వాత కొన్ని మాసాలకో వారాలకో పేరుపెడ్తారు.
ఇక ఏమిఉన్నా లేకపోయినా
పేరుమాత్రం ఉంటుంది.
పేరులేని మనిషి పృథ్విలో లేడేమో
చెట్లకు ఇళ్లకు సంఖ్యాముద్రలనైన వేస్తారు
రస్తాకు ఫర్లాంగు రాళ్లు నాట్తారు.
చిన్నవాగులకు పర్వతశిఖరాలకు పేర్లు ఉన్నాయి.
పువ్వుపువ్వుకు పేర్లు లేకపోయినా
సాముదాయికముగానైన పేర్లున్నాయి
మల్లెలు చేమంతులు శిరీషాలు పారిజాతాలు
గులాబీలలో ఉపజాతులకు పేర్లున్నాయి.
రెండువందలకు పైగానే ఉన్నాయి,
ఏనుగులకు ఆవులకు కుక్కలకు
వ్యక్తిగా కూడ పేర్లు పెట్టుకొంటారు.
ముద్దుగ పిలుచుకొనే పేర్లు వేరుగ ఉంటాయి
బాపూజి, రాజాజి, పండిట్‌జి అని
గౌరవముగా పిలుచుకొంటాము.
పుస్తకాలకు, రాగాలకు, ఆభరణాలకు
రోగాలకు, మందులకు పేర్లున్నాయి.
పేరు ఆనవాలు పట్టించేది విలాసము తెల్పేది.

పూర్వవృత్తాంతము పలికేది.
ఇతరాలతో వ్యత్యాసము చూపేది.
ఇరువది వేలకు పైగ చెట్లకు పేర్లుపెట్టారు.
రెండువందలకు పైగ ఆపిల్సులో
ఉపజాతుల పేర్లు ఉన్నాయి.
ఎన్నివందల పువ్వులో, ఎన్నిరకాల పక్షులో
పురుగులో, పాములో
పుట్టుకతో రాకపోయినా మనిషిపెట్టినవే పేర్లు
చచ్చినవాళ్లను దేనితో చచ్చినారని అడుగుతాము
రోగము తెలిసికోవాలని కుతూహలము
కీర్తనబాగుంటే ఏమి రాగమని అంటాము.
మామిడిపండు రుచిగాఉంటే ఏ జాతిది అనిప్రశ్నిస్తాము.
నక్షత్రాలకు పేర్లు ఉన్నాయి.
క్రొత్తది కన్పిస్తే క్రొత్తపేరు పెడతారు
పేరుకు అంత మహత్తు ఎందులకో
అంత కుతూహలము ఎందులకో!
క్రొత్తగ కలిసిన వానిని పేరడుగుతాము
ఫలానావారిని కలియండని పేరు చేప్తాము
మనిషి నిర్మించిన వానిలో
పేరుకు శక్తి ఎక్కువ
మనిషి పోయినా, పేరు నిలుస్తుందంటారు.
పేరువల్ల లాభము లేదు
ఆ వ్యక్తికి, ఆయన వారసులకు.
దేవుళ్ళకు పేర్లు పెడ్తాము
సహస్ర నామాలంటాము
పేర్లమీద వివాదాలాడుతాము.

తగాదాలు పెంచుతాము.

శివుడు, విష్ణువు మతానాయకులుగ చూస్తాము.
పేర్లమీదనే జెపమాలను త్రిప్పుతాము
పేర్లుమార్చి మోసాలు చేస్తాము.
కృత్రిమ విషయాల్లో గొప్పది పేరు.
రుజువుచేయ వీలులేనిదే పేరు.

ఇళ్లకు నంబరు వేస్తాము
వీధులకు ఊళ్లకు పేరులు పెడతాము.
గౌరవించడానికి వాని పేర్లను మారుస్తాము.
ఆత్మ లేకపోవచ్చు కొన్నిమతాల ప్రకారము
పేరు మాత్రము ఉండేతీరాలె.
అమంగళ నివారణకు పిచ్చిపేర్లయినా పెడతారు
పిచ్చయ్య వెంగళప్ప అనైనా పెడతారు
పేరుచుట్టు తిరుగుతుంది మానవజీవితము
కాదు, ప్రపంచమే తిరుగుతుంది
సూర్యునిచుట్టు గ్రహాలమాదిరి.
కాని ఆనందానికి ప్రేమకు
పేరుతో సంబంధము లేదు
పేరు తెలియనందున ఆనందము తక్కువకాదు.
శిల్పము, శిల్పకారుని పేర్లు తెలియకనే
శిల్పచాతుర్యాన్ని మెచ్చవచ్చు.
జానపదగీతాలు, చాటువులు, అజంతాబొమ్మలు
పేరులుపోయిన వారే రచించారు.
ఢిల్లీ మిఠాయిల పేర్లు తెలియకనే
తుష్టిగాతింటాము, అనుభవిస్తాము
రోగము పేరు తెలియకనే

వేదన పడుతాము ముదిరితే చస్తాము
పుష్పప్రదర్శనలో
పేర్లుతెలియని పువ్వులు చాలా ఉంటాయి
అందానికి వాసనకు మన ఆనందానికి
లోటేమీ రాదు
రాగాలపేర్లు తెలియకపోయినా
సంగీత మాధుర్యాన్ని అనుభవించవచ్చు

కాలేజీ అమ్మాయిలపేర్లు తెలియకపోయినా
వారిముఖ వర్చస్సు అంగసౌష్ఠవము
వేషభూషల చూస్తూ నిలిచిపోవచ్చు.
వారినడకల గమనిస్తు
హంసధ్వని రాగాన్ని తలపోస్తు
మత్తేభ విక్రీడిత పద్యాన్ని వల్లెవేస్తూ వెంబడించవచ్చు
వకుళాభరణము కీర్తనను
స్మృతివీధుల్లో విహరింపచేస్తు
వారి రాకపోకలు
అమృతవాహిని రాగముకదులుచున్నట్లు ఊహించుకోవచ్చు
పేరుతెలియని అమ్మాయిని
ప్రేమగగనములో పూర్ణిమయని భావించవచ్చు.

పేరుకు అనంతశక్తి ఉన్నా
ఆనంద సీమాంచలాలకై దాడి చేయలేదు
నామాతీతము ఆనందము
పేరు వేరుచేసేది వేరుపరచేది
దాని ఆవరణలదాటి
ఆనందము ఆకాశానికి ఎగురుతుంది

హృదయాన్ని రసప్లావితము చేస్తుంది.
పరిమళ భరితము చేస్తుంది
బ్రహ్మానందమని అలౌకికానందమని
పిలుచుకొని మురిసిపోతుంటాము.

12.4.82, మద్రాసు.

# జీవన సమరము

అడవిలో ఏనుగులు ఉడుతలు
మర్రిచెట్టు నేలజీరాడే తీగలు
ఒకటితో ఒకటి పోటీ పడనక్కరలేదు.
వేరువేరు జాతులు ఈర్ష్య పడనక్కరలేదు
మానవ సమాజములో పుట్టిన
నరగజాలు నరపిపీలకులు
నరవృక్షాలు నరగుల్మాలు
అప్పుడే సమాజ వికృతి వక్రత
దారుణమై కాన్పించేది
జన సమాజములో జీవన సమరములో
నిష్టుర క్రీడగతో చేది
మానవులు సమానముగ పుట్టారు
అవే క్షుదలు నిద్రలు
అవే పంచేంద్రియాలు
అనురాగాలు కోపాలు మాత్సర్యాలు
సంతోషాలు దుఃఖాలు
హృదయము మనస్సు పనిచేసే తీరు ఒకటే
కానీ జీవన విధానములో కొండంత వ్యత్యాసము
ఒకడు భోగ పురుషుడు
ఒకడు పరమ దరిద్రుడు
ఒకడు చందమామలతో ఇంద్రధనుస్సులతో

ఉద్దీగు నిలబడుతాడు
ఒకడు కుక్కలతో పోరాడి
ఎంగిటాకుల నాకుతాడు
పట్టుచీరెలతో రవలనగలతో
హంసయానలై విహరిస్తే!
చలికి వణుకుతు పీలికలతో
మొలను కప్పుకొంటు సిగ్గు విడనాడారు
రమ్య భవనాల నీడలలో
వానలకు ఉరుస్తు ఎండల్లో తగులబడే
తాటాకు గుడిసెల్ల వరుసలు.

సమాజములో ఆర్థిక అసమానతలలో
అట్టడుగున మురికివాడలలో
ఊపిరి పీల్చే మానవులున్నారు.
సంసార సాగరపు ఉప్పెనలకు తుఫానులకు
బలియై ఊపిరాడక చేతులు చాచేవారున్నారు
అప్పులలో పుట్టి అప్పులే వారసత్వముగ వదలి
బ్రతుకే తాకట్టుగ పెట్టేవారున్నారు
బ్రతుకు చిదుగులలో కాలుచునుంటారు.
బ్రతుకు పడవ బోల్తాపడి
చెడ్డదినాలు కాటువేయ
నాటి పెంచిన చెట్టు విషఫలములనియ్య
ఇంటిలోనే మంటలు రేగ వచ్చేసినవారు
సంపాదించే వాడుచనిపోని
చేసిన చేయని నేరాలకు జైలులో నుండ
తోడులేని ఆడవారు పిల్లలు
కుదురని జబ్బులతో మూల్గేవారు

అందరుచేర్తారు లేమి కడలి అడుగులలో.
నిస్సహాయులుగ నిరాశ్రయులుగ ఛాయా సహచరులుగ.
ఎండనక వాననక రెండు చేతులతో పనిచేస్తారు.
బీదరికపు బావినుండి బయట పడలేరు.
చేతులే పెట్టుబడిగ
రకరకాల వృత్తుల సేరుస్తారు.
వృత్తుల చరణాలు వేరైన
పాటకు పేదరికపు పల్లవే.
అంచులు కొంగులు మారినా
అతుకులు కుట్టిన పేదరికపు బట్ట ఒక్కటే.
యాచన గానాలకు తాళము వేస్తారు.
ఒడ్డు మెట్టుకు ఈదుచు చేతులు చాచుచునుంటారు.
అలలు నెట్టేస్తుంటాయి, అణచేస్తుంటాయి.
ఏడుపు కొలనులో నాచువలె ఉంటారు
బెక బెకలాడే కప్పలవలె ఉంటారు
బురద బ్రతుకే అలవాటై పోతుంది
ఏడ్చుటకైన ఓపికలేదు
కలలు కనుటకైన తీరికలేదు
రెక్కలాడితేనే సాయంత్రపు తిండి.
ఆకలిమంటల చవ్వలి నీళ్లతోనే ఆరుస్తారు
చలికి మోకాళ్లు కడుపుకు అదుముకొంటుంటారు
మన కర్మ మన కర్మ అని నిట్టూరుస్తూ
దారిద్ర్యపు జపమాలను త్రిప్పుచు నుంటారు.
తోడి మానవుల ఆదరణకు నోచనివారు
విడుపులేని నిరంతర సూర్యగ్రహణము
పాడ్యమిలేని నిత్య అమావాస్యాంధకారాలు

తిరుగులేని దూర్వాసుని శాపము
ఎల్లవేళల లక్షీదేవి పెడమొగమే.
తావిలేని అడవి పువ్వులవలె
అసువులు మూలుగుతున్న సమాధులవలె
మానవరవళికి లోయలలో అస్పష్ట ప్రతిఘోషలువలె
భ్రమించే తోలుబొమ్మలవలె
ముసరు పట్టిన మధ్యాహ్నాములవలె
కాటికి కాలుచాపు బ్రతుకులు.
గుండె బావిలో కన్నీరు ఇంకిపోయింది
అంతాపోయింది, ఆయుస్సు మాత్రము మిగిలించి
బ్రతుకు కోరిక తెరచాపల నెత్తింది
ఆత్మహత్యకు ఒడబడరు.
ఇక వారికి ఓటములు లేవు
క్రిందికిపొయ్యే నిచ్చెన మెట్లులేవు
కర్మభూమి నుండి పలాయించని
విషాదయోగము లేని అర్జునులు
భగవద్గీతలు వారికి వినిపించవు
సమానముగ చూచే స్థితప్రజ్ఞులు
అంతా నిష్కామ కర్మమే.
సర్వత్ర నిర్లిప్తతే
ఒకే ఒక విశ్వరూపము
వేయి పడగల క్రింద కాపురము.
క్షీరసాగరతట శయనము
నికృష్టజీవనము.
మానవులే మానవ రక్తమే ప్రవహించుచున్నది.
వారి నాళములలోనూ

జీవన ఆశ విడనాడలేక
ప్రేమ కిసలయములు వాడిపోలేక
దంపతులగుతారు
మౌనక్రందనములకు శ్రుతి కలిపే
సంతానము కంటారు
చివిగిన మబ్బులనుండి
తొంగిచూచే కాంతికిరణాల కంటారు
జీవన సమరములో
విజయపతాకగ
ఆనంద దేవదత్త శంఖాన్ని
ఊదుకొంటు ముద్దులు కురిపిస్తారు
వాన్నే ఆధునికులు
అలవాటులో పొరపాటని అంటారు.

14.7.82 నెల్లూరు

# ఏడుపులో ఆనందము

ఆడుగో పసివాడు ఏడుస్తున్నాడు
అని ఉత్తరాన్ని ముగించింది.
ముగింపు కవితాత్మకముగ
రసాత్మకముగ ఉన్నదని తోచింది.
ఏడుపు వెనుకనున్న
ఆనందాన్ని మాతృగర్వాన్ని
విపులీకరించాలని తలచాను.

పల్లెటూరులో సంపన్న కుటుంబము
రమ్యమైన విశాలభవనము.
ఎక్కడ ఏమి వక్రించిందో
ఇటీవల దశాబ్దాలలో ఆ భవనములో
పసివాని ఏడ్పులు ప్రతిధ్వనించలేదు.
ఉయ్యేలలో పసివాడు మేల్కొని
తనకు ఎరుకయైన భాషలో
ఆక్రందనా గానముతో తల్లిని పిలువలేదు.
అనుకొన్న వేళకీ నిద్రాగగనమునుండి
దిగివచ్చి ఆకలిని సూచించే
క్రందనస్వరాలతో కోయిలకూన కూయలేదు.
పంచమ స్వరాన చిగిర్చే
కూజితాల మాధుర్యాన్ని

రోదనాభరిత కషాయ కంఠముతో
వసంత వైతాళికులు భవనప్రాంగణములో వెదజల్లలేదు.
ఏడ్పులతో సంతసించి
తీపుల పంచే తల్లికన్నులు
వాత్సల్య రససిక్తములై
ఇంటిగోడలలో ప్రతిరూపును పొందలేదు.
సంతానానికి పురుషసంతానానికి
కరువైపోయిన పరిసరాలలో
పసిఏడ్పులే సంతోషఘంటాకాల ఊది పిలిచాయి
పిల్లలు ఆనందశృంఖలాలు.
ఇంటి సొగసైన ఆభరణాలు.
కదులుచున్న హర్షపతాకలు.
ఊపిరి పీల్చే అందమైన బొమ్మలు.

పిల్లలకై
నోములు జపతపాలు నదీస్నానాలు
యాత్రాదర్శనాలు దైవోత్సవాలు
గురుసేవలు స్వామిభిక్షలు సపర్యలు
నిత్య కృత్యాలయ్యాయి.
వైద్యచికిత్సలు నిపుణుల పరీక్షలు
తరుచుగ జరుగుచు వచ్చాయి,
ఎన్ని కలలు ఆశయాలు పట్టుదలలు–
తీగమొగ్గతొడగలేదు
పూత పిందెతాల్చకనే రాలిపోయింది
ఆశలు సపర్యలు
నభోముఖముపై రంగుముగ్గుల బొట్టును
చిత్రింపలేదు.

అనపత్య అరణ్యములోనే
నిరాశల జాడలతో, నిస్పృహల నీడలతో
హృదయము కటకటలాడుచు తిరిగింది

జీవన అపరాహ్ణమున
దత్తత అనివార్యమయ్యింది
బహుఆశ్రితజనులకు పరివారములకు
పండితులకు ఆశ్రయమిచ్చిన
వంశవృక్షము ఎండిపోరాదు
నదీమతల్లి ఎడారులలో శుష్కించిపోరాదు.
అపుల అబ్బాయినే దత్తతగ స్వీకరించారు
తమ ఇంటిపేరునే కిరీటముగ తొడిగారు.
సంపదల, ప్రేమాభిమానాల
పవిత్రజలాలతో అభిషిక్తం చేశారు.
దత్తపుత్రుడు యోగ్యుడుగ పేరుపొందాడు
పెద్ద చదువుల చదివాడు
అనపత్య శూన్యత మాసిపోయింది
గుణరాశియైన వివేకవతిని
ఇచ్చి పెండ్లిచేశారు.

క్రొత్తదంపతులు, క్రొత్తమనోరథాలు
జీవన కావ్యంలో క్రొత్త అధ్యాయము.
పదివత్సరాల దాంపత్య జీవనములో
ముగ్గురు కుమార్తెలు పుట్టారు
అందాలవాగులై ఇళ్లంతా గంతులేశారు.
శుక్ల చంద్రునివలె పెరుగుచు వచ్చారు.
ప్రేమతో పెంచారు-వినయముతో పెరిగారు

వెలుగుల వెదజల్లారు – విద్యల నేర్చారు.
లతలు పరవన వృక్షాశ్రితాలే
రెక్కలు తొడిగి పర వినువీధులలో
విహరించే విహంగాలే.
పరసరసీజలములలో ఈదవలసిన
రాజహంసలే.
పెరిగేది ఇచ్చట, కిశోర పదచిహ్నాలను
వదలి వెడలే గోవత్సలులే.
ఎదిగేది ఇచ్చట, ఊడలు నీడలు
పర ప్రాంగణములలోనే.
ప్రొద్దుటి ముగ్గులు ఇచ్చట
సంధ్యాదీపము మరెచ్చటనో.

పురుషసంతానమునకై ఆకాంక్షలు.
లేనిది కోరేది మానవహృదయము
కాన్పించని దేవుని ఆరాదిస్తుంది.
నోముల వరుసల ప్రారంభము.
మబ్బుల ఒడిలో కొంగల బారులు ఎగిరాయి
అలనాటి ఆశంకలు
చిన్న బుసలతో లేచి ఆడాయి.
వంశవృక్షము ఎండిపోరాదు
అనే మాటలే బీజాక్షరాలై
జపమాలపై ఆడేవి.
అమ్మాయిలు కోడళ్లై తరలిపోతే
కుటుంబమర్యాదను రక్షించేది ఎవరు
పితృపిండము పెట్టి సంతుష్టి కలిగించేదెట్లా.

అమ్మాయిల పుట్టుక ఆనందదాయకమే
సహస్ర నమస్కారాలు ఆ వర ప్రసాదానికి
కాని, కాని సంతానచక్రము పూర్తికాలేదు.
ముందు తరాలకు దొరల లేదు.
చక్రము తిరగాలంటే పురుష సంతానము కావాలె,
పురుషుడే గుర్రపు పగ్గాలు పట్టాలె.
కుటుంబ రథము సాగాలంటే
నాలుగేండ్లు గడిచాయి.
జప తపాలు తపనాలు అధికమయ్యాయి.
వేకువకలలు పగటికోరికలు
పురుష సంతాన వాంఛావృక్షము చుట్టు
ప్రదక్షిణలు చేసేవి.
గర్భవతి అయ్యింది.
ఆశలు నిరాశలు ఊగిసలాడాయి.
ఈ మారైనా ఆనందవిజయాన్ని సమకూరుస్తుందా
కుమారుడు పుట్టడూ, పుట్టాడులే
అనే తలపులు ఎండానీడలవలె దోబూచులాడాయి.
కూతురేపుట్టి కూతుళ్లసాలును నిలుపుకొంటుందా
అనిశ్చయ భవిష్యత్తు ఎట్టితీర్పునిస్తుందో
నిశాంతమున శుక్రుడు ఉదయిస్తాడా
రోహిణీ పొడిచి, నాలుగవ స్తంభాన్ని నిర్మించి
దుహితా మండపాన్ని తయారు చేస్తుందా ?
తీర్పుతేదీకి ఎదురుచూచారు.
పండితులు, జ్యోతిష్కులు, పెద్దలు
సోదెచెప్పే ఎరుకలు, గంగిరెద్దువాళ్లు
గుమ్మడిపండు వంటి బంగారు కొడుకు పుడ్తాడు

వంశమర్యాద కొమ్మలు రెమ్మలు వేస్తుంది
అని భవిష్యత్తువాణిని పలికించి
ఉచితరీతిని సత్కారము పొందారు.

కాన్పు సమయము వచ్చింది.
ఆశా సందేహాల బరువుతో
అలలపై ఊగే నిండు పడవవలె
ఆసుపత్రి చేరింది.
కోరుచున్న కొడుకైతే, నవయుగ వైతాళికుడు
రాజారాంమోహన్‌రాయ్ అని
పేరుపెట్ట నిర్ణయించారు.
రాజా రాజా అనే పేరే
తలపులలో తిరిగేది
కలలలో ఎగిరేది
చుట్టాలు గుమిగూడారు.
పురిటి నొప్పులు,
కార్యదక్షతా విశ్వాసముతో
శ్రద్ధాసక్తులతో, ఆసుపత్రి సిబ్బంది
నిశ్శబ్దముగ హాజరై ఉన్నారు.
మూల్గులు, కేకలు.
చిత్రప్రతిమల వలె బంధువులు
బయట నిలబడి కూర్చుని వేచియున్నారు.
సమయమే ప్రాణాయామము చేస్తూ
స్తంభించినట్లుండింది.
శుభోదయము
డాక్టరమ్మ చిరునవ్వులతో గది వెలుపల వచ్చి
రాజా, రాజా పుట్టాడు.

అంటు ఇటు అటు పడిగ తిరిగింది.
తండ్రిని చూచి కంగ్రాచులేషన్సు అని నవ్వింది.
ముకుళిత ముఖాలు ఒక్కసారిగ
ప్రఫుల్ల వదనాలయ్యాయి.
మందస్మిత హంసలు రెక్కల విప్పాయి.
అవ్వనయనాలలో ఆనందాశ్రువులు ఒలికాయి.
హర్షపులకలే హరిత తోరణాలయ్యాయి.
పైకి పొంగే సంతోషధారలే
మంగళారవములు గ తోచాయి.
సంకల్పసిద్ధి వంశవృక్షఫలము
పుత్రోదయము శుభోదయము.
టెలిఫోనులు మ్రోగాయి.
తంతులు పరుగెత్తాయి దేశవిదేశాలకు
వేడుకపండుగలు అతిథిసన్మానాలు.
మేము ముందుగనే దీవించితిమిగదా
అప్పుడే సోదె చెప్పితి గదమ్మా అన్నారు.
'ఈ ఆసుపత్రికి మంచి విరాళ మియ్యాలె
సంతోషాన్ని సుస్థిరము చెయ్యాలె' అన్నది అవ్వ.
భవనము పుత్రగర్వాన్ని ప్రతిబింబించింది.
పసివాని ఏడ్పులకు
సంతోషపు నవ్వులతో ఇల్లు మారుపలికింది.
ఉయ్యేల వీడి తల్లి ఒడి చేరాడు.
ఒడి వీడి తప్పటడుగులు వేశాడు.
అమ్మ అవ్వ అని నేర్చాడు.
లేని కీర్తనకు తాళము వేశాడు.
బోసినోటితో నవ్వాడు.

కన్నులు మూసి ఏడ్చాడు.
శుక్ల చంద్రుని వలె
కొలనులోని మొగ్గవలె పెరిగాడు.

పెద్ద బుద్ధిమంతుడు కావాలని
చదువులలో నేర్పరి కావాలని
పాడి పంటలతో సిరిసంపదలతో
దానములతో వంశమర్యాదను పెంచాలని
కార్యశూరుడు దానవీరుడు కావాలని
అంతకన్న మిన్నగ ధర్మ వీరుడు సత్యవీరుడు కావాలని
కళాపోషణ మానవసేవ చేయాలని
ఆయురారోగ్యములతో వంశవృద్ధి చేయాలని
కోరుకుంటు దీవిస్తున్నాను.
ఇదే ఏడుస్తున్న పసివాని కథ
ఏడ్పులలోని ఆనందము
పసివాడు ఏడుస్తున్నాడు అని అమ్మ ముగించింది జాబు.
సుఖీభవ అంటు ముగిస్తున్నాను నేను కవిత.

10.7.82 నెల్లూరు

# సర్వధర్మాలు-ఇస్లాం

విదేశాలకు వెళ్లేవారు తరుచుగ
క్రైస్తవ దేశాలే చూస్తారు.
అమెరికా ఐరోపీయ దేశాలనే ఎక్కువగ చూస్తారు.
నా సప్త విదేశయాత్రలలో
ముస్లిం దేశాలే ఎక్కువ చూచాను.
అదే నా ప్రత్యేకత అదృష్టం అని తలుస్తాను.
శ్రీలంక బర్మా తాయిలాండు కాంబోడియా
బౌద్ధమత దేశాలు.
జర్మనీ ఫ్రాంస్ ఇటలీ క్రైస్తవ దేశాలు
ఇండోనేషియా మలేషియా ఆఫ్ఘనిస్థాన్
ఇరాన్ ఈజిప్టు సిరియా జోర్డన్ లెబానన్ ముస్లిం దేశాలు

చిన్ననాడు మిషన్ బడిలో చదివాను
ఆనాడు బైబిల్ నిర్బంధ పాఠముగ ఉండింది.
క్లాసులో మొదటి మార్కులు వచ్చేవి.
చర్చికి పోవడములో మొదటి బహుమతి లభించింది.
బెతలహాం జరూసలేముల దర్శించాను.
క్రీస్తు పుట్టిన భూమిని సిలువవహించిన భూమినిచూశాను.
శ్రీలంక బర్మా తాయిలాండులలో
బుద్ధమందిరాలను దర్శించాను.
బుద్ధుడు జన్మించిన లుంబినీని

నిర్యాణము చెందిన దేవరియా జిల్లాలోని కుష్టియా
శ్రావస్తిపురము నలందాబుద్ధగయలను చూచాను.
జైనుల దేవాలయాలను చాలాచూచాను.
దిల్‌వారా అబూకొండల శిల్పకళా మందిరాలు
కొలనుపాక శ్రావణ బెళగోళల చూచాను.
హస్తినాపురములోని జైనదేవాలయాలచూచాను.
సిక్కుల పుణ్యభూముల పంజాబులో పెక్కుదర్శించాను.
వారి ఉత్సవాలలో పాల్గొన్నాను.
ముస్లిందేశాలలో తిరిగాను
వారి సంస్కృతి కొంత అర్ధము చేసికొన్నాను
అన్ని మతాల ప్రభావాలు నామీదపడ్డాయి.
అన్నిటినీ సమైక్య దృష్టితోనే చూచాను
వీనిలోని మహత్తులనే చూచాను.
అనుయాయుల ఆచారాలను చూచాను.
వారి భక్తిశ్రద్ధల చూచాను.
ప్రసూనములు వేరైనా ఉద్యానవనము ఒక్కటే
స్వరములు వేరైనా సంగీతము ఒక్కటే
తరంగాలు వేరైనా సాగరము ఒక్కటే
అను వినమ్ర బుద్ధితోనే భిన్నమతాల పాదాలకు
శిరస్సు వంచినాను.
అన్నీ సత్ప్రవర్తనల చెప్పేవే
అన్నీ ఋజుమార్గములో నడవమని చెప్పేవే
పికశారికాశుకములకు ఎందుకు వైమనస్యము.
అన్నీ ఒక నందన హృదయాన్నే అలంకరించేవి
అన్నీ ఒక చెట్టునే గూడులు కట్టేవి
మతాల పేరట కలహాలు

మతాలు నేర్పలేదు.
ఆదిశక్తినే అవమానించేవి
ప్రకృతినే పరిహసించేవి.

1500 సంవత్సరాల కృతము
అరేబియా ఎడారుల్లో వసించే ప్రజలమధ్య
పుట్టింది ఇస్లాం
ఇస్లాం అంటే శాంతి
ఎన్ని ఖండాలకు దేశాలకు ప్రాకింది
ఆఫ్రికా, ఏషియా, యూరోపు ఖండాలకు వ్యాపించింది
తెల్లవారు నల్లవారు పచ్చవారు
ఈ మతదీక్షను స్వీకరించారు.
ఆ గొడుగు క్రింద చల్లని నీడల రుచి చూశారు.
ఐక్యరాజ్య సభలో యిరువది రెండు ఇస్లాం దేశాలు
ప్రాతినిధ్యం వహించియున్నాయి.
మనదేశములో పదికోట్ల ముస్లింలు ఉన్నారు.
ఇండోనీషియాలో అంతకన్నా ఎక్కువ
రష్యారాజ్యంలో ముఖ్యముగమధ్యఆషియాప్రాంతములో
ముస్లింలు అత్యధిక సంఖ్యలో ఉన్నారు.
మనదేశము మూడవది ముస్లింలకు
బంగ్లాదేష్ పాకిస్థానుల కన్న ఎక్కువ సంఖ్యలో
ముస్లింలు మనదేశములో ఉన్నారు.
చైనాలో కొన్ని ప్రాంతాలలో ముస్లింలు ఉన్నారు.
కాశ్మీరమే కాక కొన్ని జిల్లాలలో
పట్టణాలలో అధిక సంఖ్యలో ముస్లింలు ఉన్నారు
కేరళ ప్రాంతములో పాతికపాలు ముస్లింలు.
వెయ్యి సంవత్సరాలపూర్వమే

ఇస్లాం మనదేశానికి వచ్చింది
ఉత్తరభారతములో చాలా భాగము
దక్షిణములో కొన్నిభాగాలు
ముస్లింపాలన క్రింద ఉండినాయి.
దేశవిభజన కోరి రెండు స్వతంత్రరాజ్యాల చీల్చి
వేరేస్థాపించుకొన్నారు.
ఇంతవ్యాప్తి ఇంతశక్తి కత్తిబలిమితోనే పొందారా
కాశ్మీరము మొదలు కన్యాకుమారి వరకు
ఎన్నివేల మసీదులున్నాయో
ఎన్నిలక్షలమంది శుక్రవారం
మసీదులలో ప్రార్థనలు జరుపుతారో
ఇంతమంది బలవంతం చేతే ఆ మతములో చేరారా
కత్తికిభయపడి చేరారా అనేప్రశ్నకు
పక్షపాతరహితముగ జవాబు అన్వేషిస్తారా.
ఏదో ఆకర్షించే శక్తి ఉండాలె
ఏదో గుప్త అయస్కాంతశక్తి ఉండాలె
మానవునికి తృప్తినిచ్చే స్వభావముండాలె
ఆనందానిచ్చే నీతిసూత్రాలు ఉండాలె
మొదటిది ఆమతమున చేరడానికి
అవరోధము లేమీ లేవు.
ఎవరైనా చేరొచ్చు కవాటాలుసర్వదా తెరువబడేఉన్నాయి
చేరినపిదప అందరితో సమానత్వం లభిస్తుంది
పాతవారు క్రొత్తవారు కలిసిపోతారు
పాతనీరు క్రొత్తనీరు నదిఒడిలో ఆటలాడుతాయి
వర్ణభేదాలు వర్గభేదాలు మాసిపోతాయి.
హెచ్చు తగ్గుకొలతలు మాయమగుతాయి.

ప్రార్థనవేళలలో భోజనవేళలలో
పంక్తిదోషాలులేవు అందరు సమానంగ నిలుస్తారు
అందరు సమానంగ కూర్చుంటారు.
అంటరానివారులేరు అగ్రవర్ణాలవారులేరు.
సమతలములోనే అందరికీ ఆహ్వానం
నేనుతక్కువ అనేభీతిలేదు సందేహము లేదు.
నేనుఎక్కువ అనే స్వాభిమానము లేదు.
నేనందరితో సమానము అనే విశ్వాసము.
తక్కువ విలువగల విషయమూ
తెలివితేటల్లో వెనుకబడినా
ఆస్తిపాస్తులలో వెనుకబడినా
ఆత్మగౌరవము ప్రతివారికీ ఉంది
ఆ గౌరవము దెబ్బతినరాదు
ఆ గౌరవానికి భంగము వాటిల్లరాదు.
వ్యక్తి మర్యాదకు హాని కలుగరాదు.
సమానత్వపు సౌభాగ్యాన్ని
ప్రపంచములో పొందుతాడు.
వైకుంఠములో ఏమిపొందినా పొందకపోయినా
కండ్లఎదుట సమానత్వపు హోదాను పొందుతాడు
అదిఅమూల్య సాంత్వన కాదా అతని హృదయానికి
పోయిన విబ్బి అతనికి ప్రాప్తించలేదా
అతను ఎందుకు సంతోషపడడు ?

స్త్రీలకు ఇస్లాంలో కొన్ని అనుకూల పరిస్థితులుదొరికాయి
తండ్రి ఆస్తిలో కుమార్తెకు కొంతభాగమున్నది.
కొడుకుకు ఒకభాగమైతే కుమార్తెకు అరపాలు.
పెద్ద ఆత్మ విశ్వాసాన్ని కలిగించే అంశమది.

భర్తవలదన్నా ఆత్మనిర్భరత్వము
కలిగించే హక్కు అది.
వివాహము అనుకూలము కాకుంటే
వదిలించుకోవడం పురుషులకు స్త్రీలకు
ఇస్లాంలో అధికారమున్నది.
తలాక్‌తో పురుషుడు ఖులాతో స్త్రీ
దాంపత్యజాలమునుండి బయటపడవచ్చు
అన్యోన్య అనురాగాలతో దాంపత్యము ఆదర్శమే.
అట్లని ప్రతికూల పరిస్థితులకు
బలిచేయడం తగనిపని
విడాకుల అవసరము అందరు అంగీకరించిందే
కొన్ని విపరీత విషమపరిస్థితులలోనే దాని అవసరము.
హిందూస్త్రీలు పోరాడి సంపాదించుకొనినహక్కు
ఇస్లాంలో తొలుతనుండి ఉండిందే
విడాకులతోపాటు పునర్వివాహము
ఇస్లాంలో సమ్మతింపబడినదే.
న్యూనతలేని ద్వితీయవివాహము
సంఘముచేత అంగీకరింపబడ్డదే.
స్త్రీలకు ఆస్తిహక్కు విడాకులహక్కు
తిరిగి పెండ్లిహక్కు సంప్రాప్తమగుతాయి.
ఎక్కువ ప్రాముఖ్యతను వివాహానికిచ్చి
జన్మజన్మాంతరములు భార్యాభర్తలుగా ఉండాలని
కోరడము మానవ వికసిత బుద్ధికి అనుకూలముకాదు.
కొందరు పోరాడికొన్నిహక్కులు సంపాదించుకొన్నారు
కొందరికి స్వతఃసిద్ధముగానే సంప్రాప్తమయ్యాయి.
ఆత్మగౌరవానికి సంబంధించింది సమానత్వపుహక్కు

ఆత్మ నిర్భరతకు సంబంధించింది ఆస్తిహక్కు
పునర్వివాహమునకు హక్కు.
కార్యాచరణకు అనుకూలమైన హక్కులు కావా ఇవి
మానవతత్వానికి అనుకూలమైన హక్కులు కావా ఇవి
అందని ఆదర్శానికి ఎగిరి క్రిందపడి చితికేబదులు
అందేఆదర్శాన్ని పట్టుకొని ఊగులాడుట మంచిది కాదా
ఇస్లాంలో హక్కులు మాత్రమేకావు
కొన్ని ప్రాథమిక బాధ్యతలు ఉన్నాయి.
దేవునికి కృతజ్ఞత తెలపడం
దినానికి నమాజు ఐదుతూర్లు చేయడం
అన్నిమతాలకన్న మిన్నగ కాన్పిస్తున్నది.
దేవుడుచేసిన మేలుకు సర్వదా కృతజ్ఞులముగా ఉండాలె.
అందరినీ సమానముగ ప్రేమించ కలిగినపుడే
రెండవభార్యను నిక్కా చేసికోవాలె
ఆదాయములో కొంతపాలు బీదలకై వెచ్చించాలె
రంజాన్‌లో దిన ఉపవాసాలుండాలె
ఇట్టి బాధ్యతలు ఉన్నాయి
కొన్ని హక్కులు ఉన్నాయి.
దేశములో పదికోట్లమంది ముస్లింలు ఉన్నారు.
ప్రపంచములో మూడవ ముస్లిం దేశము భారతదేశం
అన్యోన్యముగ మెలగి దేశాన్ని ముందుకు నడిపించాలె
వాళ్ళమంచి మనము చూడడము
మనమంచి వాళ్లు చూడడం ఎంతైనా అవసరము
అదే దేశానికి క్షేమం, ప్రజలకు శుభం.
అన్ని మతాలు గౌరవముగా బ్రతకాలె.

9—5—81 నెల్లూరు,

# శిల్పకారులు

చిత్ర చిత్ర విన్యాసాల ప్రదర్శించే
ప్రకృతిని అనుభవిస్తాము ఆరాధిస్తాము.
ప్రకృతిని నిర్మించిన మహాశిల్పి
కళానైపుణ్యాన్ని హస్తచాతుర్యాన్ని
గుర్తించుకోము మరచిపోతాము
కళాఖండాల దర్శిస్తాము.
పూర్వ సంస్కృతీ వైభవాల అంశాలన్నీ నుతిస్తాము.
ఆర్యుల సంస్కృతి నాగరికతలు
శాస్త్రాల్లో వేదాంతాల్లో మాత్రమే లేదు.
క్రియాన్వితము చేసి సౌందర్య ప్రాణాల పోసి
కళాత్మకముగ తీర్చినవారు ఆదరణ పాత్రులే.
యుద్ధాలుచేసి రాజ్యాలు ఆక్రమించిన
వారేకాదు వీరులు శూరులు
చరిత్ర తెరచాటున దీనకుటీరాల్లో బ్రతుకుచు
వంశపారంపర్యముగా శిల్పాన్ని నేర్చి
కార్యాచరణ మొనర్చి కాలపరీక్షలో నెగ్గి
ప్రపంచ విస్మయాన్ని రేకెత్తించిన కళాకారులు
తక్కువ సంస్కృతీ దుర్గ సంరక్షకులు కారు.
శతాబ్దాల అలల తాకిడిచే
కళ వికసించి పైకి తేలుచున్నది.

జీవితాల అంకితమొనర్చిన
కళామూర్తులు పూజారులు
సంఘములో అనాదరణ పొందుచున్నారు.

భవనము రమ్యముగా ఉన్నది.
నిర్మాణము చేసిన బేల్దారులు
కొయ్యపనిచేసి రంగులవేసిన జీనెగలవారు
ఆదరణ యవనిక వెనుకనే
నిలిచిపోయారు.
లోహాల భాషను నేర్చి
అభీష్టానుసారము మలిచి
స్థూలవిగ్రహాలను, సూక్ష్మఆభరణాలను
విదేశ పణ్య వీథులలో ప్రదర్శించే
కమ్మరి కంసాలి సాంఘిక వ్యవస్థలో
అడుగున నిలిచిపోయారు.
పదవిన్యాసము చూపే నటరాజులు
ఒంటికాలిమీద నృత్యమొనర్చే గణేశులు
ఆపాదమస్తకము అలంకరించే
ఆభరణాల విచిత్రరూపులు సూక్ష్మవివరాలు
భారతీయ విశిష్టత కాదా
దేశపరదేశ కళామండపాలలో
శోభించలేదా, నుతింపబడలేదా.

హస్తలాఘవముతో మంత్రించి
శిలాహృదయమార్దవ్యాలను గుర్తించి
ఉలితో మీటి
హృదయ తంత్రులపై రాగసుధను చిలికించే

శిల్పకారులు సాంఘికసింహాసనాలపై
అధిష్ఠించి లేరే
అజంతా ఎల్లోరా
కాళహస్తి మధుర రామేశ్వరాల
గుడుల చెక్కినవారు
దిల్‌వారా ఆబూ జైనమందిరాలు
తాజ్‌మహల్ లక్నో మసీదులు
నిర్మించిన శిల్ప శ్రామికులు
చరిత్రగుహల చీకట్లలో అణగిపోయారు.
మస్లినులు చీనాంబరాలు రత్నకంబళ్ళ
నేసిన తంతుకారులు గుడిసెల మసకలలోనే
ఆకలితో తూగుచున్నారు.
తోలుబొమ్మల ఆటలు, వీధి నాటకాలు
భరతనాట్య అభినయాలు హస్తముద్రలు
పదలాఘవమును చూపించిన ఆటనేర్పరులు
భోజనశాలల సహపంక్తులకు
తగనివారయ్యారు.
సంగీత రాగ లయల సమ్రాట్టులు
డోలు సన్నాయి వాద్యకారులు
కీర్తికిరీటాలకు అర్హులైనా
తగిన మర్యాదకు నోచుకొనలేదే.

ఎట్టి అభిశాప మిది?
ఏ కళాదేవత ఉన్మాదచేష్ట ఇది ?
రసహృదయ వంచితమై
శతాబ్దాలుగ కళాకారుల

తూష్ణీభావముతో ఈసడించుచున్నది.
ప్రాచీన సంస్కృతీ వైభవాల
అవమానించుచున్నది.
అర్థముకాని వేదపఠనాలు
భేదింపరాని వేదాంత పద్మవ్యూహాలు
వ్రతాలు తపాలు మాత్రమేనా
భారతీయతను ప్రపంచానికి చాటేది
శిల్పకారులు కళావ్రతులు
సంఘాదరణ పుష్పహారాలకు
అనర్హులై తేరపారచూచేవారు
శిల్పమును గ్రహిస్తాము నుతిస్తాము
శిల్పకారుల త్యజిస్తాము నెట్టేస్తాము
ఇదేనా భారతీయ సభ్యత, సమానత్వము ?
వెనుకబడ్డవారు వెనుకత్రోయబడ్డవారు
సమప్రతిపత్తిని ఎరుగనివారు.
మేల్కొన్నారు ఈ బహుజనులు
తెలిసికొన్నారు తాము అల్పసంఖ్యలోలేమని
ఆత్మమర్యాదను అడుగుచున్నారు.
భూతకాలము వారిదికాదు
భవిష్యత్తు వారి ఉన్నత సోపానములకు
గట్టిపునాదుల వేయుచునే ఉన్నది.
స్వాగత మండపాల నిర్మిస్తున్నది.
బ్రతుకు పోటీపోరులో
పై చెయ్యి వారిది కానున్నది
వారి గెలుపులకై కన్నుల విచ్చి
ఎదురు చూచుచున్నది రేపటికాలము.

అదే పనిచేసేవారి విజయము
శిల్పకారుల కళాకారుల విజయము
అభ్యుదయము, శుభోదయము

20—8—82, మద్రాసు

# విజయ వంచితుడు

వ్యాఘ్రములచే తరుమబడ్డ హరిణాలవలె
ఆకృతిగొన్న చిరు ప్రభంజన తరంగాలవలె
దేహముల కుంచించి, శిరముల ముందుకు వంచి
పరుగులిడిరి భిన్నదేశ క్రీడాకారులు
పందెముల గెలుచుటకు. స్వపతాక ప్రతిష్ఠకు
విజయసూచనగ హర్షధ్వానములు రేగెను.
క్రీడా మంటపము మారుమ్రోగెను.
అభిమానులు విజేతల భుజాలకెత్తిరి.
చలికాలపు పసిడి ఎండలలో
ఆనందహాసములు శ్వేతకపోతాల వలె ఎగిరాయి.

విజయ వంచితుడు జపాను యువకుడు
వాడిన తామరవలె వంచినతలతో మరలెను
క్రీడాదేవి వింజామరలవలె
విభిన్న దేశపతాకాల ఊగుచుండినవి
జపానుదేశపు జండాను చూడగనే
కన్నులు చెమ్మగిల్లెను.
రిక్తహస్తముతో ముఖమును తుడుచుకొనుచు
అంతర్ముఖుడై ఎన్నో విషాదదృశ్యముల చూడసాగెను.
తన అసమర్థతచే జపానుపరువు బూడిదైనదని
పతాకగౌరవము మట్టిపాలిసెనని దుఃఖింపసాగెను.
అధ్యాపకులు, సహవిద్యార్థిబృందము

ఆశలెన్నో పెట్టుకొని యుండిరి
ఎన్నిమాసాల ప్రోత్సాహాలు శిక్షణ ఆదరణ
వీడ్కోలు సన్మానాలు వమ్మైపోయెనని వగచెను
దేశములో జరిగిన పోటీలు
వ్యక్తిగతమైనవని, తాను మిన్నయగుట
అందరి ఆశల ఊరించుట సంతోషదాయకమే
విదేశములలో పోటీలు దేశప్రతిష్ఠతో
ముడిపడియున్నాయి.
తగిన శిక్షణ నిచ్చారు, ప్రోత్సహించారు.
ఉన్నత ఆశాశిఖరాలపై ఎక్కారు.
క్రీడాకౌశలముతో జపాను గౌరవమును
నిలపగలనని విశ్వాసముంచారు.
స్థానికపత్రికలలో పటాల ప్రకటించారు.
యాత్రానుమతి సమయమున,
గెలిచిననీకు పెద్దబహుమతి యియ్యగలనని
తండ్రి ప్రలోభించి ప్రోత్సహించెను.
తల్లి ఆశీర్వదిస్తు, విజయప్రాప్తుడగుదువని
విశ్వాసమున్నది, విజయమునకు జపాను
గర్వపడు కాలము ఆసన్నమైనది
మట్టితో సగము నింపిన సీసాను
ఇస్తున్నాను, జపాను చిన్నజండాను కొనితెచ్చాను
జాగ్రత్తగా ఉంచుకొని, గెలిచినపుడు
భారత వర్షపు మట్టితో సీసాను నింపి
చిన్నజండాను ఇండియా నుంచి తీసుకొనిరా
జపాను మట్టి ఇండియా మట్టి కలసిన సీసాలో
రెండు జండాలు ఎగరాలె.

అప్పుడే నీ జపాను జన్మ సార్థకమగును.
విజయస్మృతిగ జోడుగ అవి మన ఇంట అమరాలె
అని కౌగలించుకొని పోయి రమ్మనియెను.

గాలినింపిన బంతివలె, రెట్టింపు ఉత్సాహముతో
ఎగిరి ఢిల్లీ చేరాడు. పందెములో ఓడాడు
నైరాశ్యపు మేఘాలు మెదడులో ముసిరాయి.
ఇచ్చిన ప్రోత్సాహాలు, పెట్టుకొన్న ఆశలు
హృదయములో నాటిన స్వప్నాంకురాలు
మాడుతు సుడిగుండాలవలె మెదడులో తిరిగాయి.
ఎవరిదో దిష్టి తగిలిందని తలచాడు.
అమంగళదినమని తలచాడు.
గెలుపు ఓటములను లెక్కచేయని
క్రీడాధర్మ సూత్రము జ్ఞప్తికి వచ్చెను.
అది దేశములోని క్రీడలకు సరిపొయ్యేది,
కాని అంతర్జాతీయ క్రీడాస్పర్థలలో
దేశప్రతిష్ఠ ప్రధానాంశమని స్మరణకు వచ్చెను.
జయాపజయములు వ్యక్తికిగాక
దేశానికే చెందేవి
యువకుని అసమర్థతతో అపజయము
దేశగౌరవ హానియాయెను.
మర్యాదస్థానమున జండా తలఎత్తలేక పోయెను.
నిరుత్సాహజనిత శోకముచే
కుందుచు నివాస శిబిరము చేరెను.
నిద్ర దూరమాయెను.
నిరుత్సాహపడకు, వచ్చేఏడు విజయము నీదే.
అని తల్లి ప్రేమతో పంపిన తంతి

ఉదయానికే చేరెను.
జపాను విజేతల పటాలు జాతీయ పత్రికలలో వేశారు.
ఓడిన యువకుడు
దేశ ప్రతిష్ఠాక్షతికి తానే కారణమని తలచెను.
ఉల్లాసము ఉత్సాహము లేని
నైరాశ్యము నీడవలె వెంటాడుచు నుండ
మాతృదేశపు మట్టిని, ఢిల్లీ ధూళితో
కలిపివేసెను.
విజయ చిహ్నముగ నుండవలసిన ధూళి
అవమానమును రుద్దుకొని, కన్నీటితో తేమయై
ఓటమిని యిచ్చిన మన్నులో దాగి పోయెను.
క్రీడోత్సవాలు పూర్తికాగా
విజయులు, పరాజయులు దేశములో దిగిరి.
విజేతలకు హర్షధ్వానములతో స్వాగతమిచ్చారు.
సన్మానముగ ప్రధానమంత్రి
విందుభోజనము నొసంగె.
దేశాభిమానియై ఓడిన మనయువకుడు
కంటినీళ్లు త్రాగుచు, మొగముచూపలేక
తల్లికాళ్ళకడ ముఖమును దాచుకొనెను.
గద్దనుచూచి కోడిపిల్ల తల్లి రెక్కల చేరినట్లు
దేశానికి, నా దేశపుజండాకు అవమానము తెచ్చాను.
భారత వర్షము మట్టిని విజయహాసములతో
సగర్వముగ తేలేక పోయాను రంగరించి
ఈ పందాలకు నేను తగను, నాకు వలసిన
సామర్థ్యము కొరత బడ్డది.
నేనిక క్రీడోత్సవాలలో పాల్గొనను,

శాశ్వతముగ పాలించుకొంటాను
అని గద్గత స్వరముతో తల్లికి మొరపెట్టుకొన్నాడు
చెమ్మగిల్లిన తల్లి కన్నుల చూచి
భోరున ఏడ్చాడు.
స్వర్ణస్వప్నము భంగమై
భస్మరేఖలలో విలీనమాయెను.

నెల్లూరు, 14–12–82

# గజల్

## 1

1. సంజె చీకట్లలో చేయి విదలించుకొనిపోయె
అయిన నేమాయె
జీవితములోన మధుర ఉదంతమైపోయె

2. ఇందువదన కొంగువదలించుకొని పోయె
అయిన నేమాయె
మరువరాని స్మృతి తరంగాల ఊపుచుపోయె

3. చిత్తర చూపుల బెదరు హరిణమైపోయె
అయిన నేమాయె
మందహాస మాలికల మెడవేసి పోయె

4. విడిన కబరితో విరిబోడి విజ్ఞానముగపోయె
అయిన నేమాయె
ఎదకైపు గంధాల పర్వుచు పోయె

5. మెరపు తీగలాగు చీకట్లో గంతేసిపోయె
అయిన నేమాయె
ఆశల ఊరిస్తూ వెలుగుల్ల నొలికిస్తూ పోయె

6. తొట్రుపడు అడుగుల రాయంచయై పోయె
అయిన నేమాయె
విలువైన బంగారు మాటమూటల విప్పుచుపోయె

7. ఇచ్చిన బాసల్ల సవరిస్తు సాకుల వయ్యారముగ పోయె
అయిన నేమాయె
శాశ్వతముగ జ్వలించు ఆకాంక్షయైపోయె.

ఢిల్లీ
22-12-82

# 2

1. వసంతము వచ్చిందా, పువ్వులు పూచాయా
కోకిల కూసిందా
వియోగపు ఎడారుల్లో విలపిస్తు గడిపాను
గ్రీష్మమని తలచాను, వసంతము వచ్చిందా

2 నిద్ర మరచిన యామినులు
బొబ్బలు పోయిన పాదములు
గ్రీష్మమని తలచాను, వసంతము వచ్చిందా

3. మాసాల పిదప మాటయిచ్చింది
ఆశిస్తు తిరిగాను, నిరీక్షిస్తు తిరిగాను
కాళ్లు అరిగాయి
గ్రీష్మమని తలచాను వసంతము వచ్చిందా

4. దారితెలియని దేశాలు ముఖరించెను ఏడ్పులకు
తీరని దప్పికలు చచ్చిన ఆకలులు
గ్రీష్మమని తలచాను వసంతము వచ్చిందా

5. ఎడారులలేవు పువ్వులు పులుగులు
అంతా నిశ్శబ్దపు సమాధి
సమాధిలోన చిక్కిన పురుగును
లేవు కలలు లేవు వెలుగులు
గ్రీష్మమని తలచాను వసంతము వచ్చిందా వస్తుందా
ఏడ్చుటకు గుండెమాత్రము మిగిలిందా ?

నెల్లూరు, 9-1-83

## 3

జ్యేష్ఠం పోనీ శ్రావణం రానీ
మిగిలిన ముచ్చట్లు తీరని సరసాలు
తీర్చే సమయం వస్తుంది.
ఎండల వెండి వెలుగులు
ఎండ మావుల మోసాలు
పడగాలుల దుమారాలు
కదలి చననీ, శ్రావణం రానీ
కోకిల పాటలు పోనీ
నెమళ్ల ఆటలు రానీ
మొగలి పొదలు నవ్వనీ
యమున ఇసుకలు ఆరనీ
ఎండిననది పారనీ
సుప్తమురళిలో సప్తస్వరాలు
హంసలవలె ఎగరనీ
శ్రావణం రానీ
పరిమళాలు పరవశించి
నీ ఒడలిపై ఒరగనీ
మబ్బుల ఒరలో దాగిన మెరపు
కత్తివలె ఆడనీ
శ్రావణం రానీ
మబ్బుల ముసుగులో
చుక్కల ముఖాలు దాగనీ

చకోరాలు పోనీ
చాతకాలు రానీ
మబ్బుల క్రీడా భూమిలో
బలాకాలు ఎగరనీ
వేడి బాణాలు మరలనీ
బిందుబాణాలు పడనీ
మిగిలిన ముచ్చట్లు తీరని సరసా
తీర్చే సమయం వస్తుంది
శపించే విరహిణుల
నయన ధారలు కురవనీ
తమాల విపినాలు
పులకరించే ఎగరనీ
పిడుగులతో వియోగులు
బెదరుచు వగవనీ
తడిసిన వాయువులు
కొసరుచు వీయనీ
గొడుగుల కాలము
పుట్ట గొడుగుల కాలము
శ్రావణమాసము రానీ
పొలాల పచ్చగ పెరగనీ
సంధ్యా తిమిరాల్లో
కప్పల బెకబెక లాడనీ
వానలు కురవనీ
శ్రావణం రానీ
జ్యేష్ఠం పోనీ
ఢిల్లీ. 24-2-83

# 4

వసంతము వేకువనే లేచింది
మలయానిల సాయముతో
పరిమళాల ఏరింది
కోయిల కంఠములో
నవస్వరముల కూరింది
రమణీమణులు వచ్చారు
బుట్టలకై నిడి వచ్చారు
పూజల పువ్వులకై వడివడి వచ్చారు
లతలు తలలు వంచి
మ్రొక్కుచు నిలిచాయి
పువ్వులు పూబోడులు
గంతులు వేస్తు ఎగిరారు
విశ్వమే నవ్వింది
అంతా ఆనందము ఉల్లాసము
వసంతలక్ష్మి
వనమున పరుగులిడింది
మదనుడు సాయకముల ఏరాడు
భాండారము నింపాడు
యౌవనోత్సవాలు
యువకులు యువతులు
పులకిత మయ్యారు.
భూదేవి చలిదుప్పటి తొలగించి
చిరునవ్వు ముగ్గుల వేసింది.

ఢిల్లీ, 26-2-83

# 5

ఆమె కాళ్ల చప్పుడులు
నాకు తెలియనివా
హృదయ భావాలకు
మారు పలికేవే.
గుండె మర్మాలు చెప్పేవి కళ్లు
గుండె ఉద్వేగాలు చెప్పేవి కాళ్లు
భాషవేరు యాసవేరు
చప్పుడులు కాళ్లచప్పుడులు
నాకు తెలియనివా.
ఆమె మందయాన మత్తేభయాన
ఆమే మరాళయాన మయూరయాన
మదాలస పదరచన కుశర
గమన విలాసాలు చరణ ధ్వనులు
రకరకాల బాణీలో ఉన్నాయి
మృదంగ వాద్యములో
మధుర చమత్కారాలు
వేరువేరు ముక్తాయింపులు
నాకు తెలియనివా
ఈ కాళ్ల చప్పుడులు ?
చీకటిలో వెడలే వేళల
వెన్నెల'లో విహరించే వేళల
వనమున విరులు కోసే వేళల

చరణములు పలికే రీతి వేరు
తాళవిశేషముల వల్లిస్తుపోతాయి
ఆమె అభిసారిక కాగలదు
విరహోత్కంఠిత కాగలదు.
వినోదిని విలాసిని వియోగిని
ప్రణయ రసధుని
హావభావ స్వర్ణఖని
తెలియును తెలియును
ఆమె కమల చరణ ధ్వనిలయలు

నెల్లూరు, 24—4—83

# 6

ఆమె వసంతమై వచ్చింది
ఆమె ఋతుశోభయై వెలిగింది
నందనము వికసించింది
ఆనందవనము గంధభరితమయ్యింది
కవితాకోకిల సన్నాయి ఊదింది
మలయానిల సూత్రాలతో
పువ్వులతేరు సాగింది
నేను ఒళ్లంతా కన్నుచేసి చూశాను
దేహమంతా పులకిత మయ్యింది
హృదయ భారంతో కాళ్లు కదులుటలేదు
ఆ సంధ్యా దృశ్యము
ఆమె కమనీయ దర్శనము
నేను మాత్రము సమ్మోహమునవే
విరహముతో ఒడలు మరచాను
ఆమె చీకట్లలో కరిగిపోయింది.

నెల్లూరు, 24-4-83

# స్ఫులింగాలు

1. వసంత సంపదా, చెలీ
నిన్ను కాంచిన తరి
రాగ ఝరీ తీరాల అంచులు
చేరినట్లు ఉంటుంది

2. చుట్టాలు స్నేహితులు చుట్టూ ఉన్నారు
ఆమె ఎక్కడనుంచో ఎందుకో వచ్చింది
దృష్టి అంతా ఆమె మీదే
వలపులన్నీ ఆమె మీదే

3. నిద్రించిన నిశీధములో
విహరించే స్వప్నాలు
హృదిలో పొదిగే భావాలు
విశ్రమించాయి ఆమె ముఖఫలకములో

4. మెదడు బడలి యున్నది.
దుఃఖాలు మూగుచున్నవి
కలలు మేల్కొనుచున్నవి.

5. కలలు ఎట్లా పుట్టునో
ఎందుకు పుట్టునో
దీర్ఘ భవిష్యత్తుకు పునాదుల
వేస్తాయి కొన్ని కొన్ని

6. నిద్రా మాగాణములలోనే
విహరిస్తుంటాయి స్వప్నహరిణాలు

7. నిశీథ తిమిరాల్లో
స్వప్నవిహంగాలు ఏమి వెదకుచున్నవో
ఏ తీరని కోర్కెల కొమ్మలనో
ఏ మరచిన గూటి చిదుగులనో

8. దిగంత సింధూర కపోలాలపై
శుక్రతార చందన తిలకముగా నున్నది

9. దేహము దృఢముగా ఉండింది
వాంఛల ఆనందాలు దుఃఖాలు
అదుపులో ఉన్నాయి
దేహము శుష్కించింది
వాంఛలు అదుపు తప్పి పర్విడినాయి

10. ప్రాయములో లేత కోరికలు
ముదిమిలో ముదిరి క్రమ్గినవా
లేకున్న, ఏమిటీ వాంఛల ఆనందపు ఊరేగింపులు
పేరంటాండ్ర వేషాల్తో ఖల్లోహాలతో

11. ఈ వయసున శృంగార కవిత్వాలు ఎందుకు వ్రాస్తున్నారు
చిన్నతనమున శక్తి లేక అన్నాను ఆమె ప్రశ్నకు

భావాలకు లేదు రిటైరుమెంటు
స్మరణలకు లేదు ముదిమి
పాతబడేది భాషగాని, కవిత్వంకాదు

12. నిదురించిన రాత్రిలో
రేగిన శిరోజాలా
ఈ నల్లమబ్బుల అలల దండలు
ఎందులకో ముసిరాయి
ఆవేశాల రేకెత్తుచు
13. కొన్ని పేనా విసరులతో
నేను ఏమిచేశాను
కొన్ని జీవన రహస్యాలను
బయట పడవేశాను.
14. కవితా యౌవనీ
నీ నుండి సెలవు తీసికొంటున్నాను.
ఓరిమితో మెలగు
పాత కవితలకు నిద్రవస్తున్నది
క్రొత్తపాటలు పాడి లేపు.

10-3-83, కరూరు రైలులో